# సృజన

జూన్ / జులై
1984
152 / 153

సాహిత్యచరిత్ర :

**అభ్యుదయ సాహిత్యోద్యమం**

చారిత్రక పరిశీలన :

**కమ్యూనిస్టు ప్రణాళిక**

కథ :

**ఆకలి మంటలు**

నడుస్తున్న చరిత్ర :

**ఏజెన్సీలో పోలీసుక్యాంపులు**

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

152/153 మాసపత్రిక జూన్/జూలై 1984

| | | |
|---|---|---|
| సంపాదకీయం | | 1 |
| పాట : | జమిడీక పలికింది - భూపాల్ | 4 B |
| సంస్మరణ : | ఖడ్గసృష్టి - శ్రీశ్రీ | 5 |
| | గౌరమ్మ కలలు నుంచి.... చెరబండరాజు | 27 |
| కథ: | ఆకలి పంటలు - గోపి | 39 |
| సాహిత్యవ్యాసాలు : | అభ్యుదయ సాహిత్యోద్యమం - కె.వి.ఆర్ | 8 |
| | కమ్యూనిస్టు ప్రణాళిక - ఒక చారిత్రిక పరిశీలన - త్రిపురనేని మధుసూదనరావు | 29 |
| నడుస్తున్న చరిత్ర : | 'ధర్మభూమి' - కె. బాలగోపాల్ | 45 |
| | శరీరాన్ని పరిపేశ పెట్టండి-సురా | 52 |
| | రాకేష్ రాకెట్ ప్రయాణం-సి.ఎన్ | 56 |
| పుస్తక సమీక్ష: | జానకివిముక్తి | 59 |
| కరపత్రం : | రాడికల్ విద్యార్థి సంఘం, మహబూబ్‌నగర్. | 65 |

| నిర్వహణ | సృజన | ఈ సంచిక రు. 3 |
|---|---|---|
| సాహితీ మిత్రులు | హనుమకొండ 506 001. | సంవత్సరచందా రు. 20 |

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Printed, Edited & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Navatha Printers J. P. N. Road, Warangal - 506 002
for Venkataramana Mudranalayam, Warangal

'ఆపరేషన్ బ్లూ స్టార్' విజయవంతమైంది. అమృతసర్ స్వర్ణదేవాలయం సైన్యం కైవసమైంది. డెబ్భైవేల సైనికులు పన్నెండువేల గ్రామాలలో దారిపొడుగునా కాపలాకాసి మూడురోజుల్లో ఈ విజయాన్ని సాధించారు.

ఇది అలెగ్జాండర్ దండయాత్రకాదు. గజనీ, ఘోరీల దండయాత్రకాదు. అక్బర్ దండయాత్రకాదు. ఒక ప్రభుత్వంమీద వేరొక ప్రభుత్వం ప్రకటించిన యుద్ధంకూడకాదు. భారత ఉపఖండంలోనే ఇదివరకెన్నడూ లేనంత శక్తివంతమైన కేంద్రప్రభుత్వం ఒక రాష్ట్రంలో టెర్రరిస్టుల సాకు పెట్టుకొని ప్రజలమీద చేసిన దాడి ఇది. ఒక మెజారిటీ మతోన్మాదం ఒక మైనారిటీ మతోన్మాదం మిషచూపి ప్రజాస్వామ్య విలువలను కాలరాచిన దారుణమిది.

'టెర్రరిస్టు' చర్యలను అణచడానికి ఇంత కీలకమైన, ఇంత పెద్దదైన చర్య ప్రపంచంలోనే ఎక్కడా తీసుకోలేదని పత్రికలురాసాయి. అంటే ఒక ఉద్యమంలోని ఒకధోరణిని అణచడమనే సాకుపెట్టుకొని తనప్రజలమీద తనదనుకోబడే ప్రభుత్వం ఇంతవరకు ఏ నాగరికప్రభుత్వం పూనుకోనంత పాశవికమైన దమనకాండకు పూనుకున్నదన్నమాట.

ఇందిరాగాంధీ ఇపుడింక 'గాయాలను మాన్పే' చర్యలగురించి మాట్లాడుతున్నది టెలివిజన్‌లో రేడియోలో సిక్కులంటే రక్తదాహులన్నట్లుగా ప్రపంచానికి ప్రదర్శిస్తున్నది. 'మిలిటరీచర్య' అనేమాట బాధాకరమైన మాట. ఆ మాటమరచిపోదామంటున్నది. పూర్తిప్రశాంత పరిస్థితి ఏర్పడేదాకా పంజాబ్ నుంచేకాదు స్వర్ణదేవాలయం నుంచికూడ మిలిటరీని ఉపసంహరించేది లేదనికూడ అంటున్నది. పంజాబ్‌లో పూర్తి ప్రశాంతస్థితి ఏర్పడడమంటే ఆఖరి పంజాబీకూడ తన ఆత్మగౌరవాన్ని చంపుకొని వియంత ఇందిర ముందు దాసోహమనడమన్నమాట. అదిప్రాణమూ అభిమానమూ వున్న మనిషి చేయగలిగేదికాదు. అందువల్ల శవాలలొంగిపోయి శ్మశానశాంతి ఏర్పడడమే ప్రత్యామ్నాయం.

సమస్య అకాలీల డిమాండులు న్యాయమైనదా భింద్రెన్‌వాలా ఉద్యమంన్యాయమైందా, 'ఖలిస్థాన్'నినాదం న్యాయమైందా అన్నదికాదు.

పవిత్ర దేవాలయాలు ఆయుధాల గిడ్డంగులు అయ్యాయనీ, అందులోనూ విదేశీ ఆయుధాల ఆగారాలయ్యాయనేవి ఒకప్రచార స్టంటు, తమవివేకాన్ని ప్రచారానికి పణంపెట్టి సెంటిమెంటుకు లోనయ్యేవాళ్ళు దీనిని నమ్మడానికి సిద్ధంగావుంటారు,

నిన్నగాక మొన్న లైసెన్స్ మళ్ళీఇచ్చిన శివాగన్‌ఫ్యాక్టరీలో దొరికిన ఆయుధాలు ఏ విదేశీ సహాయంతో ఉత్పత్తి అవుతున్నాయి? కాశ్మీరువంటి కీలకమైనప్రాంతంలో పూర్తిగా విదేశీ గుత్తపెట్టుబడి సహాయంతో ఆయుధాల ఫ్యాక్టరీనడుపుతున్న ధీరేంద్ర బ్రహ్మచారి అరెస్టుకూడకాడు, పైగా నిస్వార్థుడైన దేశభక్తుడవుతాడు. ప్రభుత్వాలు ప్రజల్ని పాలించడానికి, అణచివుంచడానికి గుండుసూదిమొదలు రాకెట్టుదాకా సామ్రాజ్యవాదాలనుంచి అరువు తెచ్చుకుంటుంటే ఆ అసమర్థమైన, అవినీతికరమైన, లంచగొండి ప్రభుత్వాలచేతినుంచి ప్రజలచేతుల్లోకి పోయే ఏ వస్తువయినా విదేశీయమైంది కావడంలో ఆశ్చర్యమేముంది.

అయినా స్వర్ణదేవాలయంలోకి విదేశీ ఆయుధాలేవచ్చాయో, హాషీష్, హిరాయిన్ వంటి మత్తు పదార్థాలు వచ్చాయో లేదో ప్రజలు నమ్మడానికి అక్కడ ఒక స్వేచ్ఛాయుతమైన వాతావరణం వుండాలి. పత్రికలమీద ఆంక్షలులేకుండా, ప్రజలందరికీ పంజాబ్‌లోకి, స్వర్ణదేవాలయంలోకి ప్రవేశాన్నికల్పించి, ఏ భయభీతావహ వాతావరణం కల్పించకుండా 'టెర్రరిస్టులు' ఏ 'కుట్ర' చేసారో రుజువు చేయగలిగితే తప్ప ఉద్యమంలోని తప్పొప్పుల చర్చ అర్థం లేనిది.

ప్రభుత్వమే స్వర్ణదేవాలయంలో ఇవన్నీపెట్టి పత్రికలవాళ్ళను ఇప్పుడు తీసుకపోయి, అదికూడ తాను అనుకున్నవారిని, అనుకున్న పద్ధతిలోతీసుకపోయి టెర్రరిస్టుల మీదికి నేరాన్ని నెట్టుతున్నదని కొట్టిపారేస్తే-అది దేశద్రోహమనో, విదేశీ దాస్యమనో గుండెలు బాదుకొని ప్రయోజనం లేదు.

అకాలీ ఉద్యమంలో కొన్ని రాజకీయ, మత సమస్యలున్నవి. వాటిలో కొన్ని న్యాయమైనవీ వున్నవి. కొన్ని పరస్పర చర్చల్లో సర్దుబాటు చేసుకోగలిగినవీ వున్నవి. అనేవీ గొంతెమ్మ కోర్కెలుకావు. వానిలో ఏవైనా గొంతెమ్మ కోర్కెలస్థాయికో, ఖలిస్థాన్ నినాదంస్థాయికో చేరుకున్నాయంటే అందుకు పూర్తి బాధ్యత ఇందిరాగాంధీదే. ఇవాళ ఆమె మిలిటరీచర్యకు తలతాకట్టు పెట్టి తాళంవేస్తున్న పార్లమెంటరీ పార్టీలదే.

బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జాతీయోద్యమంలో భాగంగా సహాయనిరాకరణోద్యమంలో వీరోచిత పాత్రవహించిన పంజాబ్ రైతాంగానికి నాయకత్వాన్ని అందించిన అకాలీలు ఇవాళ మతవాదులైతే దానికి బాధ్యులెవరు? సిక్కులు ఒక మతంగాకన్న జాతిగా మిలిటెంట్ సెక్యులర్ స్వభావాన్ని చూపినవాళ్ళు ఇవ్వాళ హిందూ మతాన్ని శత్రువుగా, భావించే మతభావాలకు పోది అయ్యారంటే దానికి బాధ్యులెవరు? ఒక్కమాటలో చెప్పాలంటే నెహ్రూ కుటుంబం వెనుకఉన్న శక్తుల

గురించి చెప్పాలంటే సామ్రాజ్యవాద కుట్రలు- భూస్వామ్య ధనికరైతాంగ ప్రయోజనాలు. వీటన్నిటినీ కాపాడుతూ తమపదవులు కాపాడుకోవడానికి దశాబ్దాలుగా నెహ్రూ, ఇందిరలు వేస్తున్న ఎత్తుగడలు, అల్లాఉద్దీన్ దీపాలను, భస్మాసురహస్తాలను సృష్టించిందివాళ్ళే. అవితమ చేతులుదాటిపోయి, తమను దహించేంతగా పెరిగిపోతే వాటిని అంతంచేసే సాకుచూపి ప్రజలఇళ్ళలో దీపాలను మలిపి, ప్రజలచేతుల్ని విరిచేసే ఆ ప్రజాస్వామిక చర్యకు పూనుకుంటున్నదీ వీళ్ళే

కనుక సమస్య-సమస్యలోని న్యాయాన్యాయాల విచికిత్సకాదు, పరిష్కారంలోని ప్రజాస్వామిక-ఫాసిస్టువైఖరి. ఒక సమస్యను సృష్టించి, ఆసమస్యను తానుతప్ప పరిష్కరించలేదనే స్థాయికి సంక్లిష్టం చేసి, తానుకూడ మామూలుగా కాకుండా మారణహోమంతో తప్ప పరిష్కరించలేనని అందరితో అనిపించుకొని, ఆపరిష్కారమార్గాన్ని ఎంచుకోవడం ఫాసిస్టు స్వభావం, దోపిడీవర్గ సమాజ రాజ్యాంగయంత్రానికి ఆ స్వభావం వుంది.

మొదటపూర్తిగా ఒకతప్పుడు చైతన్యాన్ని కలిగించడం-ఆచైతన్యాన్ని తనకున్న అన్ని ఉపరితల సాధనాలద్వారా ఇంక ఆమాయలో మనం పడిపోయేంతగా పెంచి పోషించడం- ఆ తప్పుడు చైతన్యంతో ప్రవర్తించేలా కండిషన్ చేయడం సామ్రాజ్యవాద, భూస్వామ్య సంస్కృతి

ఉదాహరణకు భారత ఉపఖండంలో వేలాది సంవత్సరాలుగా జీవిస్తున్న విభిన్న జాతులను మతవిశ్వాసాలు ఆధారంచేసుకొని ఒక 'అఖండ భారతజాతి'గా చిత్రించడం ఎంత తప్పుడు చైతన్యం. విశ్వాసం చరిత్రను పక్కకునెట్టి విశ్వాసమేలేదా ప్రచారమే చరిత్రగా చలామణీఅయి తమకు ఇష్టంలేకుండా తమమీద ఒక కేంద్రప్రభుత్వం సాగించే పెత్తనాన్ని ఏ జాతిఅయినా ప్రశ్నిస్తే అది 'జాతీయసమైక్యత'కు భంగకరమవుతుంది. అది దేశభద్రతకు ముప్పుగా భావించబడుతుంది ఢిల్లీ భద్రతయే నాగా, మిజో, మణిపూర్, అస్సాం ప్రజల భద్రత ఎందుకుకావాలో, ఇందిరాభజనయే భజన్‌లాల్‌తోపాటు పంజాబీలుకూడ ఎందుకుచేయాలో ఇందిరాగాంధీ ఇచ్చే స్థానంలోనూ, దేశంలో నలుమూలలవున్న ప్రజలు తీసుకొనే స్థానంలోనూ ఆమె ప్రధాని అయినంత మాత్రాన ఎందుకు వుండాలో మనం ఎందుకు ప్రశ్నించకూడదు? ఆ ప్రశ్న ప్రజలు వేస్తున్నారు పోరాటప్రజలు వేస్తున్నారు. ప్రజలపోరాట చైతన్యంతోనేకాదు ఆచరణతో అన్నిమౌలిక ప్రశ్నలను రేకెత్తించినపుడు రాజ్యాంగయంత్రం వారిమీద విరుచుక పడుతున్నది. నాలుగు దశాబ్దాలుగా నాగాలాండ్, మిజోరామ్, మణిపూర్‌లలో

సాగుతున్న మిలిటరీపాలన, అస్సాంలో మిలిటరీజోక్యం. మనకు తెలియకుండానే మనలో చొటుచేసుకునే మధ్య తరగతి తప్పుడు చైతన్యం లైసెన్స్ ఇచ్చినందువల్ల వచ్చినవే.

మధ్య తరగతి హింసను, దౌర్జన్యాన్ని, పెత్తనాన్ని సహించరు. ప్రజలూ సహించరు. అయితే ప్రజలు ఈ వ్యవస్థకున్న హింసా స్వభావాన్ని నిత్యమూ అనుభవిస్తున్నారు గనుక దీన్ని ప్రతిఘటిస్తారు. మధ్యతరగతి విడివిడి సంఘటనల్లో, చర్యల్లో చూసే హింసను వ్యవస్థలో చూడలేదు. ఒక స్వభావంగా, ఒక చైతన్యంగా ఈ తప్పుడు అవగాహన మధ్యతరగతికే కాదు వర్గ చైతన్యంలేని అందరికీ వుంటుంది. అందుకే 'టెర్రరిస్టులు' నూటాయాభై మందిని నాలుగు నెలలుగా చంపారన్నది వాళ్ళను హడలగొట్టినంతగా ఒక్కరోజులో ఒక్క ఆవరణలో మిలిటరీ నాలుగు వందల యాభై మందిని చంపారన్నది మనసుకెక్కదు. అంటే వ్యక్తుల 'అనాగరికతను' హింసా స్వభావాన్ని అసహ్యించుకొని, ద్వేషించి, ఖండించి వ్యతిరేకించే శిక్షణ, సంస్కృతి మనకేపరిస్తున్నారు. ఏ వ్యక్తికీ సాధ్యం కానంత అనాగరికంగా, అమానుషంగా హింసాకాండను అమలుచేసే అణిచివేత స్వభావంగల రాజ్యాంగ యంత్రాం ఇస్తున్నది. అందుకే పోలీసులు, మిలిటరీ హత్యచేస్తే అది మనకు హత్యే అనిపించదు. శాంతిభద్రతలను కాపాడడానికి. అనివార్యంగా చేసిన చర్యగా కనిపిస్తుంది.

నక్సలైట్లు ఇప్పటి వరకు ఎందరిని చంపివుంటారు. పోలీసులు ఎన్‌కౌంటర్‌ల పేరుతో ఎందరిని చంపివుంటారు? నక్సలైట్లు ఎన్ని దోపిడీలు చేసివుంటారు? ఈ దోపిడీలను అరికట్టే పేరుతో పోలీసులు ఎంత విధ్వంసభీభత్సకాండ సాగించి వుంటారు? నక్సలైట్లు ఎంత హింసరచన చేసి వుంటారు? అహింసా ప్రభుత్వందాన్ని ఎదుర్కోవడానికి ఎంత 'ధ్వంసనచణ' నాచరించి వుంటుంది? ఎప్పుడైనా ఆలోచించామా?

ఇదంతా ప్రతిహింసగానో, ప్రతిఘటన పోరాటంగానో నువ్వు అంగీకరించినా అంగీకరించకున్నా, బలం, ఆయుధం ఎప్పుడు అవసరమైతే అప్పుడు ప్రయోగించడానికి పుష్కలంగా అందుబాటులో వున్న ప్రభుత్వాలు 'విగ్రహం' చూపే విషయంలో ప్రజాస్వామ్యవాదులు, స్వేచ్ఛాప్రియులు ఏమాత్రం ఉపేక్షించినా పరిణామం ఫాసిజమే.

స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం ఆశించిన యూరోపియన్ బూర్జువావర్గం రష్యాలో ఏర్పడిన శ్రామికవర్గ నియంతృత్వాన్ని నిరోధించే వెర్రి ఆకాంక్షతో

జర్మనీ, ఇటలీ, స్పెయిన్, జపాన్‌లలో నాజీజాన్ని, ఫాసిజాన్నీ తమ ప్రాణాలకే ముప్పయ్యేదాకా తెచ్చుకున్నది.

ప్రభుత్వాలు ఏ స్వభావం పొందే క్రమంలో మనం ప్రభుత్వ విధానాలను పరిశీలిస్తున్నాం, విశ్లేషిస్తున్నాం, బలపరుస్తున్నాం అనే సోయి లేకపోతే ప్రజాస్వామ్యాన్ని కాపాడడమో సాధించుకోవడమో మన నిజమైన ఆకాంక్ష ఐనా మనం మిలిటరీ పాలనలో కూరుకపోతాం. మతోన్మాదాన్ని అరికట్టాలన్న మన సెక్యులర్ ఆకాంక్ష చిన్న మతాల్లో అనుమానాలను, పెద్ద మతాల్లో అహంకారాన్ని పెంచుతుంది. 'టెర్రరిజాన్ని' అణచడానికి ఎంత ఘాటయిన మిలిటరీ చర్య అయినా మంచిదే అనుకుంటే మనం భయపడే 'టెర్రరిజం' రూపు మాసి పోకపోవడం అలా వుంచి దానిని ఫాసిజం మాత్రమే అణచగలదనే ఆమోదాన్ని ఫాసిజమే మననుంచి పొందుతుంది. (ఈ దేశానికి మిలిటరీ క్రమశిక్షణ కావాలండీ. అవినీతి, లంచగొండితనం ఆశ్రిత పక్షపాతం, అరాచకం తొలగి పోవాలంటే మిలిటరీ పాలన కావాలండీ—అని చాలామంది 'ప్రజాస్వామ్య' వాదులైన మేధావులు విసుగుతో, అసంతృప్తితో, నిరాశలో చాలాసార్లు అంటూవుండడం అసాధారణం కాదు) ఈ క్రమంలో తమ స్వేచ్ఛను అరికట్టిన ప్రభుత్వం ప్రజల స్వేచ్ఛను అంతకంటే కఠినంగా విరిచేసి వుంటుందని పత్రికలు కూడ అర్థం చేసుకోవు సెన్సార్‌షిప్‌నే స్వేచ్ఛగా భ్రమించే స్థితికి ఎదుగుతాయి. తమను బాజాభజంత్రీలుగా మార్చుకున్నదీ పాలక పార్టీ అనే స్పృహను ఇతర పార్లమెంటరీ ప్రతిపక్ష పార్టీలు కోల్పోతాయి. మిలిటరీని తొలగిస్తే మళ్ళీ ఏం ముంచుకొస్తుందో అనే వాతావరణం కల్పిస్తే తక్కిన సమస్యలకు కూడ మిలిటరీ పరిష్కారాలు కోరుకునే భ్రమకు లోనవుతాం. ఫాసిజానికి సాంస్కృతికంగా బౌద్ధికంగా, ఆలోచనల్లో గేట్లు తెరచిన వాళ్ళమవుతాం. అందుకు, ముఖ్యంగా అందుకు పంజాబ్‌లో మిలిటరీ ప్రవేశాన్ని ఖండించాలి. అందుకోసం, ముఖ్యంగా అందుకోసం పంజాబ్ నుంచి మిలిటరీని ఉపసంహరించాలని డిమాండు చేయాలి.

భింద్రేన్‌వాలా వైపు మన అందరి దృష్టి మళ్ళించి ఇందిరాగాంధీ మన అందరి జీవితాల్లోకి, ప్రైవేట్ జీవితాల్లోకి కూడా మిలిటరీని ప్రవేశపెట్టింది. 'టెర్రరిజం' భయం పెట్టి ఫాసిజాన్ని ఆమోదయోగ్యంచేయ బోతున్నది. స్వభావాలను, ఉద్రేకాలను, ఉన్మాదాలను ఎత్తి చూపి సమస్యలను, ఉద్యమాలను, ప్రజా చైతన్యాన్ని మట్టుపెట్టదలచుకున్నది. తస్మాత్ జాగ్రత్త!

22-6-84

పాట :

# జమిడిక పలికింది

భూపాల్

జమిడిక పలికింది, జోహారంటూ
జనంగుండె పలవరించె పోరేడంటూ....

॥జమిడిక॥

శిలం మించి కత్తిపట్టి
జులుం చిలుం మట్టుబెట్టి
విప్లవ ఆకాశంలో
వెలిగినట్టి వేగుచుక్క
ప్రజాకళల వనంలోన
పవిత్రమైన కాంతిమొక్క
పాణిగ్రాహి అమరుడనీ
పాట జనం మరువదనీ....

॥జమిడిక॥

నాగావళి వంశధార
నీరుమోసె జ్ఞాపకాలు
గిరులు తరులు మింటికెగిసి
పోరు కథలు చాటి చెప్పె
బొడ్డపాడు బారువలస
గొడ్డలి కత్తుల మిసమిస
పాణిగ్రాహి పేరు వింటె
పాలుకంట్లు తెరిచి చూసె....

॥జమిడిక॥

అడుగులతో ఆటలతో
చిన్నబాబు సరిమువ్వలు
అడవులలో ఆకులలో
చిరుగాలుల సవ్వడిలా
అందుకునే ఆదిలాబాదు
కదిలివచ్చె కరీంనగరు
సవరన్నను గోండన్నను
సాయుధులను కమ్మంటూ....

॥జమిడిక॥

కురుపాము సంగమొలస
కొండలంటె గుండెలున్న
కటికపేద ప్రజలింక
కన్నులెర్ర జేసిరనీ
ఆ కన్నుల కాంతి పండి
ఒక ఉదయం వచ్చెననీ
సూర్య కిరణ ఆయుధాలు
చెండాడును దోపిడినని....

॥జమిడిక॥



ఖడ్గసృష్టి

రెండు రెళ్ళు నాలుగన్నందుకు
గూండాలు గండ్రాళ్ళు విసిరే సీమలో
క్షేమం అవిభాజ్యం అంటే
జైళ్ళు నోళ్ళు తెరిచే భూమిలో

అస్వతంత్రతని జయించడానికి
అహింసాయుధం ధరించామంటూ
రక్తపాతం లేకుండానే
రాజ్యం సంపాదించామంటూ

అవినీతి భారీ పరిశ్రమలో
అన్యాయాల ధరలు పెంచేసి
స్వాంతంత్ర్యాన్ని బ్యాంకుల్లో వేసుకుని
చక్రవడ్డీ తిప్పే కామందులకు

క్షణం క్షణం మారుతున్న లోకాన్ని
సరీగా అర్థంచేసుకున్న వాళ్ళంతా
పేద ప్రజల పక్షం వహించడమే
పెద్ద అపరాధమైపోయింది

అహింస ఒక ఆశయమేకాని
ఆయుధం ఎప్పుడూ కాదు
ఆశయం సాధించాలంటే
ఆయుధం అవసరమే మరి

ఆశయం ఉండడం మంచిదేకాని
అన్ని ఆశయాలూ మంచివి కావు
ఆశయాలు సంఘర్షించే వేళ
ఆయుధం అలీనం కాదు

అందుకే అంటున్నాను నేను
అందుకో ఆయుధం అని
ఆచరణకి దారి తీస్తేనే
ఆవేశం సార్థక మవుతుంది

అందుకే సృష్టిస్తున్నాను
అధర్మ నిధనం చేసే ఈ ఖడ్గాన్ని
కలంతో సృష్టిస్తున్న ఖడ్గం ఇది
జనంతో నిర్మిస్తున్న స్వర్గం ఇది

ఈ కత్తి
బూజు పట్టిన భావాలకి
పునర్జయం ఇవ్వడానికి కాదు
కుళ్ళిపోతున్న సమాజ వృక్షాన్ని
సమూలచ్ఛేదం చేయడానికి

దీన్ని
నల్లబజారు గుండెల్లో దించు
దీనితో
కల్లా కపటాలను వధించు

ఇది
సమాన ధర్మాన్ని స్థాపిస్తుంది
నవీన మార్గాన్ని చూపిస్తుంది

ఈ కత్తి
ఊహా సమూహాల వ్యూహాలు పన్ని
వీర విహారం చేస్తూ
రణక్షోణిలో
జనాక్షౌహిణులు కదలడానికి

అందుకే రాస్తున్నానొక గీతి
చేస్తున్నా నొక హేతి
రావోయి లోనికి
సందేహం దేనికి?

ఇది నిజం
నవధర్మం మానవధర్మం
అణుప శక్తికన్న
మానవ శక్తి మిన్న
రావోయి రావోయి లోనికి
సంకోచం దేనికి?

నను చూడగా ఇదేవేళ
నా మనః కార్మిక శాల
కరిక్కేది భావాగ్ని సెగలు
కరిమ్మేది దావాగ్ని పొగలు

రావోయి రావోయి లోనికి
రాసేది రవ్వృష్ణ గీతి
చేసేది పవ్యగ్ని హేతి

# అభ్యుదయ సాహిత్యోద్యమం

## పూర్వరంగం

కోమింటర్న్ 7వ సమావేశంలో ఫాసిజం ప్రమాదానికి వ్యతిరేకంగా డిమిట్రోఫ్ ప్రతిపాదించిన 'పాప్యులర్ ఫ్రంట్' పంథా వెలుగులో, మన కమ్యూనిస్టు పార్టీ అనుసరించవలసిన విధానాన్ని 'దత్-బ్రాడ్లీథీసిస్' నిర్దేశించింది. కాంగ్రెసులోని అభ్యుదయకర శక్తులతోనూ అలాంటి ఇతర పార్టీలతోనూ సామ్రాజ్యవాద వ్యతిరేక విశాల జాతీయ ఐక్యసంఘటన కట్టవలసిందిగా కోరింది. "సాహిత్య, సాంస్కృతిక రంగానికి యీ యెత్తుగడలను విస్తరింపజేయడమే అభ్యుదయ రచయితల ఉద్యమం" అని సజ్జాద్ జహీర్ అన్నాడు.

1934 నుంచీ కాంగ్రెసు సోషలిస్టుపార్టీవాటున కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణం చేసుకుంటూ వచ్చిన తొలి కమ్యూనిస్టులు, కరాచీ కాంగ్రెసు తీర్మానం, పూర్ణ స్వరాజ్ తీర్మానం, ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుతో సంబంధాలు, సామ్రాజ్యవాద వ్యతిరేక సమితి కార్యవర్గ సభ్యత్వం, సోవియట్ యూనియన్ సందర్శనం వంటి అంశాలను బట్టి జవాహర్‌లాల్ నెహ్రూని కాంగ్రెసులోని అభ్యుదయ పక్షానికి నాయకుడని భావించారు. సుభాస్‌బోస్‌లో కూడా ఆశాకిరణం చూసారు. జయప్రకాశ్‌వంటి కాంగ్రెసు సోషలిస్టులతో చేతులు కలిపారు. బూర్జువా జాతీయవాద ప్రభావం మొదటి నుంచీ తమమీదనే బలంగా ఉంది. గాంధీ సత్యాగ్రహోద్యమాల వైఫల్యం కారణంగా మనస్సు మార్చుకుని కమ్యూనిస్టులుగా మారసాగిన యువకులు తొలి కమ్యూనిస్టులకు జతకూడారు.

దేశ ఆర్థికజీవితంలో వలసాధిపతుల అండదండలతో భూస్వామ్యం ఈశతాబ్దంలో మూడు, నాలుగు దశాబ్దాలదాకా తనరాజకీయ ప్రాబల్యం కొనసాగించింది. మొదటి ప్రపంచయుద్ధకాలానికల్లా బలపడిన జాతీయపెట్టుబడిదారీశక్తులు గాంధీనడిపిన జాతీయోద్యమాలను తమ స్వప్రయోజనాలకోసం తెలివిగా వాడుకుంటూ వలసాధిపతులనుంచి రక్షణలూ రాయితీలూ సంపాదించుకున్నాయి. సమ్మె పోరాటాల్లో రాటుదేలిన పారిశ్రామిక కార్మికవర్గం ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసులో మితవాద నాయకత్వంకింద బూర్జువా జాతీయవాదాన్ని అంటకాగే పంథానేఅనుసరించసాగింది.

పెట్టుబడిదారీ ప్రపంచాన్ని మొత్తంగా అతలాకుతలం చేసిన ప్రపంచ ఆర్థిక మాంద్యం 1930 తర్వాత ఒక దశాబ్దకాలంపైగా దేశాన్ని పులిలానాకి విడిచింది. పేదరికం వ్యాపించింది. నిరుద్యోగం పెరిగింది. చిన్నచిన్న ఆస్తులు కరిగిపోయాయి. రుణభారం హెచ్చింది. రైతాంగం నడ్డివిరిగింది. ఉప్పు సత్యాగ్రహం చప్పబడడంతోటి గాంధీ ఉద్యమాలమీద గురిచెదిరి, యువజాతీయవాదులూ టెర్రరిస్టులూ సోషలిజం ఆకర్షణకు లోనయ్యారు. ఆంధ్రదేశంలోకి కమ్యూనిస్టు ఉద్యమం ప్రవేశించింది. గ్రామాల ధనిక రైతుకుటుంబాలకో బస్తీలపెటీ బూర్జువావర్గానికో చెందిన కొత్తతరం నుంచి ప్రధానంగా దీని నాయకత్వం వచ్చింది. 'కూలిరక్షణ సమితి,' 'రైతురక్షణ సమితి,' యువజన సంఘాలువంటి నిర్మాణరూపాలతో అది పల్లెపట్టులోనూ పట్న వాసాల్లోనూ వ్యాపించసాగింది. అప్పటికింకా తెలుగుబస్తీల్లో ఆధునిక పరిశ్రమలంటూ ఏర్పడలేదుగనక నిజంగానే పారిశ్రామిక కార్మికవర్గానికి చెందిన కమ్యూనిస్టుపార్టీని నిర్మించడం అసంభవం. కాకుంటే కొత్తగా తలెత్తుతున్న జనపనార మిల్లుల్లోనూ ప్రింటింగ్ ప్రెస్సుల్లోనూ పనిచేసేవారినీ జట్టుపనివారినీ సంఘటిత పరచడం సాధ్య మైంది. ఇక, గ్రామసీమకు సంబంధించి అప్పట్లో రీసెటిల్మెంట్ వంటి ప్రభుత్వ విధానాలకూ జమీందారీ అక్రమాలకూ వ్యతిరేకంగా రంగానాయకత్వాన సాగుతూ వచ్చిన రైతాంగ ఉద్యమంలో ఆంధ్ర కమ్యూనిస్టులు కొంతకాలం సహకరించారు. పిచ్చుమంతలకు. కూలిరేట్లకు వ్యతిరేకంగా పోరాటాలు నడిపారు. నిరాడంబరమైన జీవనసరళితో కార్యదీక్షతో త్యాగశీలంతో వీరు ప్రజాభిమానం పొందగలిగారు. 1935 నాటికి కాకినాడలో మొదటిపార్టీ మహాసభ జరిగింది. రెండోది 1938లోనూ మూడోది 1943లోనూ బెజవాడలోనేజరిగాయి.

సామ్రాజ్యవాద వ్యతిరేకతతోబాటుగా దేశప్రజా ప్రయోజన పరత్వంతో తెలుగు రచయితలు చాలకాలంగా సాహిత్యం సృష్టిస్తూవచ్చారు. రాజకీయాల్లో మితవాది అయికూడా వీరేశలింగం సామ్రాజ్యవాదుల 'బంటు' మాత్రంకాదు. గురజాడ రచనల్లో బూర్జువా ప్రజాస్వామికభావాలు స్పష్టంగా కనిపిస్తాయి. అంతక్రితమే చిలకమర్తి రైతుల దుర్దశను వినిపించివున్నాడు. పారిశ్రామికంగా దేశం వెనకబాటు గురించి కవులెందరో వాపోయారు. "నల్లదొరతనం" వద్దు వద్దంటూ గరిమెళ్ల సత్యనారాయణ, వడ్డాది సీతారామాంజనేయులు వంటి జాతీయవాదులు బలమైన ప్రచారగేయాలతో వరవడిపెట్టారు. గాంధీయుగాన్ని స్వాగతిస్తూ ప్రభుత్వ నిర్బంధ కాండను గర్హిస్తూ నాటకాలు వెలువడ్డాయి. 'కాంగ్రెస్‌వాలా'ను ఆదర్శీకరించేలా

దువ్వూరి రామిరెడ్డివంటి కవులు జాతీయోద్యమగేయాల నెన్నిటినో రచించారు. వివాహ వ్యవస్థను విప్లవీకరించే 'ప్రేమ' బంధాన్ని మిన్నులకెత్తుతూ వ్యక్తి స్వేచ్ఛాపరత్వంతోటి కాల్పనిక ధోరణిలో శృంగారకావ్యాలు రచించిన భావకవులుసైతం అప్పుడప్పుడు దేశ స్వాతంత్ర్యం గురించి పలవరించకపోలేదు. ఆవిషయంలో తల్లావఝుల శివశంకర శాస్త్రి, కొడాలి ఆంజనేయులు వంటివాళ్లు జైళ్లకుగూడాపోయారు. నాయని సుబ్బారావు చదువేమానుకున్నాడు, కృష్ణశాస్త్రి హరిజనోద్యమంలో చురుగ్గాపాల్గొన్నాడు. ఈ జాతీయవాద సాహిత్యాని కంతటికీ మకుటాయమానమైనరచన ఉన్నవ లక్ష్మీనారాయణ నవల 'మాలపల్లి.' బోల్షివిక్ విప్లవ ప్రభావం తెలుగుసాహిత్యంలో మొదటిసారిగా, కొంచెం వికృతరూపంలోనే అయినా, దీనిద్వారానే పొటమరించిది. తొలి కమ్యూనిస్టులు ఈ నవలను విస్తృతంగా ప్రచారంచేశారుకూడా. ఆర్థికమాంద్యం దుష్ఫలితాల గురించికూడా తెలుగుకవులు ఎందరెందరోరాశారు. కథలూవచ్చాయి. అంటే, ఆంధ్ర దేశంలో కమ్యూనిస్టు ఉద్యమ ప్రారంభకాలానికే రాజకీయ స్పర్శగల సాహిత్యం ఉందన్నమాట. మరో దశాబ్దం తర్వాత వచ్చిన అభ్యుదయ సాహిత్యోద్యమానికి ఒకరకంగా ఇది దేశీయమైన సాహిత్య పాత్రిపదిక.

కమ్యూనిస్ట్ ఉద్యమంతోబాటే శాస్త్రీయ సోషలిస్ట్ భావాలు సాహిత్యంలోకూడా క్రమంగానైనా రాకతప్పలేదు. నిడుబ్రోలులో రంగా నడిపిన 'రైతాంగపాఠశాల' లో పాల్గొన్న శెట్టిపల్లి వెంకటరత్నం గిరిరాజు రామారావు, సబ్నవీసు రామారావువంటికవులు రంగా పత్రిక 'వాహిని' కి సంపాదకత్వం వహించిన గరిమెళ్ల సత్యనారాయణ, వర్గ వ్యత్యాసాల గురించి బలమైన గేయాలే రాశారు. రైతుల పక్కన కూలీలను నిలిపారు సమానతను ప్రబోధించారు. దైవభావాన్ని సవాల్ చేశారు. సాదా భాష వాడారు. పాటలకు ప్రసిద్ధి కలిగించారు. అలాగే పెండ్యాల లోకనాథం, గద్దె లింగయ్య, తుమ్మల వెంకట రామయ్య, చదలవాడ పిచ్చయ్య వంటికవులు కార్మికవర్గం గురించీ, కమ్యూనిస్టుపార్టీ గురించీ రాశారు. 'వాహిని'తో బాటు గద్దె లింగయ్య పత్రిక 'ప్రభ' ఈ రచనలకు వేదిక లయ్యాయి. సత్యాగ్రహిగా జైలుశిక్ష అనుభవిస్తూ క్రొవ్విడి లింగరాజు గోర్కీ 'మదర్' ను 'అమ్మ'గా తెలుగు చేశాడు, అది అచ్చుపడకముందే తుమ్మల సంక్షిప్తానువాదం 'మాతృహృదయం' పేరుతో వచ్చింది. కూర్మా వేణుగోపాలస్వామి దంపతులు గోర్కీ కథలను అనువదించారు. ముంగండ నుంచి విశ్వసాహిత్యమాల, నిడమర్రు నుంచి ప్రగతి ప్రచురణాలయం, ఎలమర్రు నుంచి ఆదర్శ గ్రంథ మండలి, అనంతవరంనుంచి కార్మికసంఘ ప్రచురణలు మార్క్సిస్టు సిద్ధాంత

గ్రంథాలతోబాటు కొన్ని రష్యన్ సాహిత్య గ్రంథాలను ప్రకటించాయి. ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘస్థాపన నాటికల్లా కమ్యూనిస్టుపార్టీ స్వయంగా 'నవశక్తి' 'ప్రజాశక్తి' పత్రికలనూ ప్రజాశక్తి ప్రచురణాలయాన్నీ నడుపుతూవుంది.

హిట్లర్ విజృంభణతో ముంచుకురాసాగిన ఫాసిజం ప్రమాదం నుంచి సంస్కృతిని సంరక్షించాలంటూ రోమారోలాం, హెన్రీ బార్బూజ్, లూయిస్ అరగాం హెచ్.జి.వెల్స్, థామస్ మేన్, మాక్జిం గోర్కీ-వంటి సుప్రసిద్ధ యూరపియన్ రచయితలు 1935 లో పేరిస్‌లో ఒక మహాసభ జరిపారు. పైచదువులకోసం ఇంగ్లాండులో వుంటూ, కమ్యూనిస్టు ఉద్యమప్రభావానికి లోనైన సజ్జాద్ జహీర్, ముల్కరాజ్ ఆనంద్, యం.డి. తసీర్, జె.సి ఘోష్, ప్రమోద్ సేన్‌గుప్తా వంటి ఉన్నత కుటుంబాల భారతీయ యువకులు ఈ మహాసభలో పాల్గొనివచ్చి, రాల్ఫ్‌ఫాక్స్ సాయంతో 'ఇండియన్ ప్రోగ్రెసివ్ రైటర్స్ గ్రూప్' రూపొందించారు. 1935 డిసెంబర్‌లో 'ఇండియన్ ప్రోగ్రెసివ్ రైటర్స్ అసోసియేషన్' అలహాబాదులో ఏర్పడింది. ప్రేమ్‌చంద్, రఘుపతిసహాయ్ ఫిరాక్, నిరాలా, సుమిత్రానందన్‌పంత్ వంటి రచయితల సంతకాలతో ఒక ప్రణాళిక తయారైంది. దరిమిలా 1936 ఏప్రిల్‌లో లక్నోలో ప్రేమ్‌చంద్ అధ్యక్షతన అఖిలభారత స్థాయిలో అభ్యుదయ రచయితల మహాసభ జరిగింది. లక్నో కాంగ్రెస్ సమావేశంలో జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షోపన్యాసం సోషలిస్టు పదజాలంతో నిండివుండడం ఇక్కడ గమనించదగింది. కాంగ్రెసు విదేశాంగవిధానంలో సామ్రాజ్య వాదవ్యతిరేకతతోబాటు ఫాసిజం వ్యతిరేకత కూడా చోటు జేసుకుంది. స్పెయిన్ అంతర్యుద్ధంలో ఏర్పడిన 'ఇంటర్నేషనల్ బ్రిగేడ్' లో జవహర్‌లాల్ నెహ్రూ కనీసం చుట్టపుచూపుగా వెళ్లి పాల్గోడం, ముల్కరాజ్ ఆనంద్ కూడా స్పానిష్ యుద్ధరంగాలను దర్శించిరావడం-ఇవి కూడా గమనించదగిన అంశాలు.

అభ్యుదయ రచయితల మహాసభ సందర్భంలో లక్నోవెళ్లివుండిన అబ్బూరి రామకృష్ణారావు అక్కడి ప్రముఖులతోమాట్లాడి విశాఖపట్నం తిరిగివచ్చాక, శ్రీ శ్రీ పురిపండా వంటి యువ రచయితలను కూడగట్టి ప్రయత్నానికి నాందిగా 'ఆంధ్ర వర్తమాన లేఖక సంఘం' పేరుమీద ఒక ప్రణాళికను అచ్చువేయించాడు. లక్నో ప్రణాళికను అనుసరించిందేగాని దానినుంచి స్వతంత్రించిందేమీలేదది. అప్పట్లో అబ్బూరి కమ్యూనిస్టు. విశాఖపట్నంలో చండ్ర రాజేశ్వరరావువంటివారిని కమ్యూనిస్టులుగా మార్చేందుకుగూడా ప్రయత్నించేవాడు. అబ్బూరి ద్వారా తన చేతికివచ్చిన

యాపత్రికాశకలు శ్రీశ్రీని బాగాతాకాయి. 1933 నాటికే భావకవిత్వధోరణి వదిలించుకో గలిగిన శ్రీశ్రీ కవిత్వాన్ని పీడిత ప్రజావిప్లవానికి అనుకూలమైన దారిలోపెట్టాయి. ఒకదానివెంట నొకటిగా శ్రీశ్రీ తన మహాప్రస్థాన గేయాలు రచిస్తూపోయాడు. నవ్యసాహిత్య పరిషత్తు కాకినాడ సమావేశంలో (1936) పాల్గొనే నాటికి ఆంధ్ర కమ్యూనిస్టుల ప్రేరణతో ఏర్పడిన ఆంధ్ర యువజన సంఘం పరిచయం ఏర్పడి, వారి మహాసభలో తన గేయం చదివి వినిపించడం కూడా జరిగింది. అంటే, అభ్యుదయ రచయితల సంఘం తెలుగుదేశానికి దిగిరాకముందే, రైతాంగ ఉద్యమం నుంచీ కమ్యూనిస్టు కార్యకలాపాలనుంచీ కేవలం సాహిత్య ప్రేరణలనిపించే ఆర్థికదుస్థితి ప్రేరణలనుంచీ తెలుగుసాహిత్యంలో కొత్తపోకడ మొదలైందన్నమాట. అబ్బూరి త్వరలో రాయిస్టుగా మారినందుచేత 1935 తర్వాత ఎనిమిదేళ్ల దాకా అభ్యుదయ రచయితల సంఘం ఈ ప్రాంతంలో తలెత్తలేదు,

## 2

అ ర సం. పుట్టుక - పెరుగుదల

జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులలో 1943 నాటికల్లా గుర్తించదగినంతటి మార్పే వచ్చింది. ఇంకా ప్రపంచయుద్ధం సాగుతూనేవున్నా, ఫాసిజం పొంగు అణిగింది. సోవియట్ యూనియన్ ప్రవేశంతోటి, అంతవరకు సామ్రాజ్యవాద యుద్ధమని తాము వర్ణించిందే 'ప్రజాయుద్ధం' అయినట్టుగా కమ్యూనిస్టులు ఎర్ణించ సాగారు. అంతలో పూరుకోకుండా, దేశంలో బ్రిటిష్‌యుద్ధకృషికి సాయంచేయ బూనారు. జపాన్ సైనికదురాక్రమణ ఇంకా పురోగమిస్తూ దేశసరిహద్దులను సమీపిస్తూవుంది గనక దేశరక్షణకోసం తామీపనికి దిగడం గురించి సమర్థించుకో వచ్చు ననుకున్నా, 1940 తర్వాత మళ్ళీ ఆందోళన పంథాపట్టిన జాతీయోద్యమం, ముఖ్యంగా 1942 నాటి క్విట్ ఇండియాపోరాటం, కమ్యూనిస్టులను దేశరాజకీయాల్లో ప్రధాన స్రవంతికి దూరంచేసింది. అందుచేతనే కాంగ్రెసునుంచి, కాంగ్రెసుసోషలిస్టు పార్టీ నుంచి కమ్యూనిస్టులను గెంటివెయ్యడం జరిగింది. అయితే ఎంతోకాలంగా పార్టీ మీదవుంటూ వచ్చిన నిషేధం ఇప్పుడు తొలగిపోయింది గనక, బహిరంగ జీవితాన్ని సద్వినియోగం చేసుకుని పార్టీనీ ప్రజాసంఘాలనూ పటిష్ఠంచేసుకునే అవకాశం లభించింది. పార్టీ మొదటి మహాసభ బొంబాయిలో జరిగేనాటికి (1943) అది గణనీయమైన రాజకీయ శక్తికాగలిగింది. యుద్ధపరిస్థితుల వల్ల దేశంలో ఏర్పడ్డ ఆర్థిక

దుస్థితినుంచి జనానికి తోడ్పడేందుకు ఎన్నో విధాలుగా పనిచేస్తూ ప్రజాభిమానం పొందింది. అయితే, నిర్బంధంలోవున్న జాతీయోద్యమనాయకుల విడుదలకోసం ఆందోళనసాగించినా, 'మాస్కో మానసపుత్రుల'ని తమకు వచ్చిన చెడ్డపేరు తేలికగా పోలేదు.

ఆంధ్ర రాజకీయాలలో గూడా ఇలాంటి పరిస్థితే వుండేది. రాష్ట్రకాంగ్రెసు లోని మితవాదనాయకత్వం డాక్టర్ పట్టాభి వంటివారి మంత్రాంగంతో కమ్యూనిస్టుల మీద ధ్వజమెత్తింది. ప్రజాసంఘాలను కాంగ్రెసు అనుబంధ సంస్థగా గుర్తించాలంటూ రంగాతోకలిసి, అఖిలభారత కాంగ్రెసు కమిటీ సమావేశాలలో కమ్యూనిస్టులు చేస్తూవచ్చిన ఆందోళనను పటేల్ సాగనివ్వలేదు. రంగాతో కూడా విభేదాలు వైషమ్యస్థాయికి వచ్చాయి. కమ్యూనిస్టులను పడతిట్టుతూ 'కామ్రేడ్ వెంగమ్మ' వంటి నాటకాలతో రంగా అనుచరులు నిందాప్రచారానికి పూనుకున్నారు. కొట్లాటలు కూడా జరిగాయి. చివరకు, మినూమసానీ వంటి కాంగ్రెసు సోషలిస్టు పార్టీనాయకులు రాష్ట్రానికి వచ్చివెళ్ళి, ఆ పార్టీచాటున కమ్యూనిస్టు లెలా తమపార్టీ నిర్మాణాన్ని సాగించుకొన్నారో జయప్రకాశ్ నారాయణ వంటి అగ్రనాయకులకు చెప్పి ఒప్పించిన ఫలితంగా, కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కూడా తలుపులు మూసేసింది. అప్పటికే యువజన సంఘాన్నిస్థాపించి జమీందార్ వ్యతిరేక పోరాటాలలో రైతు సంఘాన్ని రాటుతేల్చివున్న కమ్యూనిస్టులు 1943 తర్వాత ఏకాకిగానైనా స్వతంత్రంగా వ్యవహరించగలిగరు. పల్లెటూళ్ళలోగూడా ఫాసిస్టు ప్రతికూల శిక్షణా శిబిరాలునడుపుతూ ప్రధానంగా రైతాంగంనుంచి వచ్చిన యువకులతో ప్రజానాట్యమండలికి ప్రాతిపదికలు ఏర్పాటు చేస్తూవచ్చారు. ఈ పరిస్థితులలో ఏర్పడిందే ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం.

తాపీ ధర్మారావు అధ్యక్షతను 1943 ఫిబ్రవరి 13-14 తేదీల్లో అ.ర.సం. ప్రథమ మహాసభ తెనాలిలో జరిగింది. గోపీచంద్, జి.వి. కృష్ణారావు, అబ్బూరి వంటి రాయిస్టు రచయితలు సైతం దీనిలో పాల్గోలేదు. శ్రీ శ్రీ, కుటుంబరావు ఆ నాటికి రాష్ట్రంలో లేరు. కాబట్టి పార్టీ సంబంధీకులదే సంఖ్యాధిక్యత. చదలవాడ పిచ్చయ్య కార్యదర్శి అయ్యాడు. చాగంటి సోమయాజులు, నిడమర్తి అశ్వినీ కుమార్ దత్తు, మహీధర రామమోహనరావు, రాటకొండ నరసింహారెడ్డి, అత్తలూరి సర్వేశ్వరరావు, పట్టికొండ రంగయ్య, వట్టికొండ విశాలాక్షి, తాపీ మోహనరావు, సెట్టి ఈశ్వరరావు, కార్యవర్గ సభ్యులు.

దేవుడు, ప్రళయం, కర్మ అనే మూడు "గాలి మూటల"ను కొందరు అస్త్రాలుగా మార్చి ప్రజలమీదికి విడిచి ఆలోచనను అడ్డగించి అభివృద్ధిని నిరోధిస్తున్నారనీ, వీటిని నిర్మూలించేందుకే అభ్యుదయ రచయితలు పూనుకోవాలనీ తాపీ ధర్మారావు అన్నారు. "ఈ దృష్టిని చూస్తే, మన పూర్వ వాఙ్మయమంతా జనసామాన్యానికి ద్రోహం చేస్తూ ఉందన్నమాట తేటపడుతుంది. అదంతా స్వార్థ పరులు చేసిన మోసం అని బోధపడుతుంది. విజ్ఞానాన్ని చిన్నపరచిన వాఙ్మయం, అబద్ధాలకు చేయూతనిచ్చి, అధికులను బలపరిచే సాహిత్యం, కల్లలకు కటికతనానికి పట్టుగొమ్మ." తమిళ దేశంలో ఇలాంటి అభిప్రాయాలతోనే పాతగ్రంథాలన్నిటిని దహనం చెయ్యాలనే ఉద్యమం ఇటీవల ప్రారంభమైంది గాని, అంతటి "తీవ్రప్రతిక్రియలు" అవసరం లేకుండానే నిరసనదృష్టిని అలవరచుకుంటే చాలునని చెప్పారు.

"అవసాన దశలోవున్న పౌరాణిక వాసనలు" నూతన జీవిత ధోరణులను అడ్డగించి వేస్తూన్నస్థితిలో, ప్రధాన జీవితపోరాట సమస్యల్ని పరిష్కరించే మార్గం చూపుతూ, "జాతీయౌన్నత్యాన్ని, జాతీయవికాసాన్ని, జాతీయైక్యతను కోరుతున్న మనం" ప్రజాసామాన్యంలో మానసిక వికాసం కలిగించి అభివృద్ధి పరిచే బాధ్యత తీసుకోవాలి, అని 'సంఘకర్తవ్యం' నిర్దేశించాడు పిచ్చయ్య. జాతిమతవైరుధ్యాల్ని పురిగొల్పే సాహిత్యాన్ని ఖండిస్తూ, "సర్వతోముఖ సాంఘికజీవితాభివృద్ధికి, స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సమానత్వం, శాంతి, అభ్యుదయాలకు అవకాశం కలిగే మార్గాన్నను సరిస్తూ, అలాంటి సామాజికవ్యవస్థ కోసం "పాటుబడడంగూడా అవసరం. కర్తవ్యమే" సామ్రాజ్యవాదం, ఫాసిజం సామాజిక జీవితవ్యవస్థను ఛిన్నాభిన్నం చేస్తున్న ఈనాడు మన బాధ్యతలు యెక్కువైనాయని గుర్తిస్తున్నాం."

సామ్రాజ్యవాద వ్యతిరేకత, ఫాసిజం వ్యతిరేకత, వాచ్యంగానే వున్నాయి. వర్గభేదాల ప్రస్తావనా ఉంది. ఆకలి, దరిద్రం, అవిద్య వంటి సామాజిక జీవిత అపలక్షణాలను పేర్కొడమూ జరిగింది నూతన సామాజిక వ్యవస్థనూ గమ్యంగా చూపడమూవుంది. లేనిదల్లా పదును, స్పష్టత. ముసుగుమాటలను ఆశ్రయించడం ఎందుకంటే, ప్రజాసంఘంకాబట్టి పదుగురిని కూడగట్టుకురావాలనే తాపత్రయం వల్లనే. ఇది ప్రణాళికలోనే వున్నలోపం. 1935 నాటి పరిస్థితుల్లోనైనా, పోరాటశీలమైన సాంస్కృతిక సంఘం ఎలాంటినిర్దిష్టమైన దృక్పథాన్ని అవలంబించాలో అది జరగలేదు. 1943 నాటికిగూడా ఆప్రణాళికలో ఏమార్పు లేకుండానే తెలుగుచేసి ప్రకటించడమే జరిగింది.

"భారతీయ సామాజిక జీవితంలో తీవ్రమైన మార్పులు జరుగుతున్నవి. అభివృద్ధినిరోధక తత్త్వం క్షీణించి అవసానదశలో వున్నప్పటికి పూర్తిగా నశించలేదు. పైపెచ్చు తన అస్తిత్వాన్ని నిలపెట్టుకోడానికి విశ్వప్రయత్నాలు చేస్తూవుంది. పౌరాణిక సంస్కృతికాలం గడచిన తర్వాత, భారతీయ సారస్వతం యధార్థ జీవితం నుంచి తప్పించుకుపోయి వినాశకరమైన ధోరణిని అవలంబించింది. తర్వాత సాహిత్యం వాస్తవిక సంఘటనలను విసర్జించి నిరాధారమైన ఆధ్యాత్మికవాదం, ఊహాజనిత ఆదర్శవాదాన్ని పట్టుకొని వేళ్లాడింది. తత్ఫలితంగా భారతీయ సారస్వతం శుష్కించి నీరసించి కరకు వాదస్తాలతోను తప్పుడు ఆదర్శాలతోను నిండిపోయింది.

మన సమాజంలో జరుగుతున్న మార్పుల్ని గుర్తించి వాటిని అభివృద్ధిని ప్రతిబింబింపజేసే సాహిత్యాన్ని సృష్టించడం భారతీయ రచయితల విధి. సారస్వతంలో శాస్త్రీయమైన హేతువాదాన్ని చొప్పించి దేశంలోవున్న అభివృద్ధికరశక్తులకు చేయూతనివ్వాలి. కుటుంబజీవితం, సమాజము, మతం, సెక్సు, యుద్ధం-మొదలైన సమస్యలమీద వ్రాయబడ్డ రచనలలో కనబడే అభివృద్ధి నిరోధక తత్వాన్ని అరికట్టాలి. కులమత కక్షలు. జాతి విద్వేషం, వర్గదోపిడి—వీటిని పురిగొల్పే వ్రాతల్ని ప్రతిఘటించాలి. ఈబాధ్యతను నిర్వర్తించడానికి భారతీయ రచయితలు సాహిత్య విమర్శనా దృష్టిని అలవరచుకొని, పెంపొందించుకొనవలసిన అవసరం ఎంతైనా వున్నది.

నేటివరకు సారస్వతం, తదితర కళలు ఛాందసవర్గాల చేతుల్లో నలిగి మలినమవుతున్నవి. వాటిని వారి ఆధిపత్యంనుంచి తప్పించడం ప్రజాసముదాయానికి సన్నిహితపరచడం, జీవితయాదార్థ్యాన్ని ఉన్నదున్నట్లుగా కనుబరిచే శక్తివంతమైన సాధనాలుగా జేయడం, ఇవి సంఘంయొక్క ప్రధానోద్దేశ్యాలు,

భారతీయ నాగరికతలోని ఉత్తమ సాంప్రదాయాలకు వారసులమని నొక్కిచెపుతూ, మనదేశంలోని అభివృద్ధినిరోధకత్వాన్ని అన్నివిధాలా విమర్శిస్తాము. మనదేశం ఒక నూతనజీవితాన్ని లక్ష్యంగా పెట్టుకొని పాటుపడుతూవుంది. అందుకు తోడ్పడే ప్రతివిషయాన్ని వెలిబుచ్చడం ద్వారాను, నూతన రచనలద్వారాను, ప్రోత్సహిస్తాము. ఇందుకు వలసిన దేశీయ, విదేశీయ విజ్ఞానసంపదను వినియోగించుకుంటాము. మనభారతీయ సారస్వతం- ఆకలి, దారిద్ర్యం, రాజకీయ బానిసత్వం, సాంఘికంగా వెనుకబడడము- మొదలైన జీవితప్రధాన సమస్యల్ని చర్చించాలి- అని విశ్వసిస్తున్నాము.

నిస్తబ్దత, కార్యశూన్యత, హేతువ్యతిరేకతలకు దించే ప్రతిరచనను అభివృద్ధి నిరోధకమైనదిగా తిరస్కరిస్తున్నాము.

ఆచారాల్నీ, వ్యవస్థల్ని, హేతువాదంతో పరిశీలించడానికిన్ని కార్యాచరణకు ప్రోత్సహించి, సంఘటనాశక్తిని అలవరచి, మార్పులు తేవడానికిన్ని తోడ్పడే విమర్శనాభావాన్ని మనలో ఉత్తేజింపజేసే ప్రతివ్రాత అభివృద్ధికరమైనదిగా భావిస్తూ దానిని స్వీకరిస్తున్నాము."

యుద్ధ వ్యతిరేకత, భావస్వాతంత్ర్యం, వాక్స్వాతంత్ర్యం విద్యార్థుల విజ్ఞానాభివృద్ధి, వయోజన విద్య, స్త్రీల అభివృద్ధి- వీటికి సంబంధించి తీర్మానాలు చేసారు.

ఇలా మొదలైన అ.ర.సం., సంవత్సరకాలానికే ప్రజాశక్తి వైఖరికి భిన్నమైన ఆలోచనా రీతులుగలవారిని ఎందరినో ఆశ్రయించి వారిమద్దతు సంపాదించుకునేందుకు తాపత్రయం చూపింది. "భారతీయ నాగరికతలోని ఉత్తమ సాంప్రదాయాలు" అంటే పండిత సంప్రదాయంకూడా అయినట్టుగా భ్రమపడింది. ప్రజాసంస్కృతిలో సైతం పండితసంప్రదాయ ప్రభావంలేనిది మాత్రమే సమాదరించదగిందనే అవగాహన లోపించింది. రెండవ మహాసభ 1944 డిసెంబర్‌లో బెజవాడలో జరిగేనాటికే, విశాల ప్రాతిపదికగల సంఘం ఏర్పడాలనే తహతహ మూకుమ్మడి సంఘం ఏర్పడేందుకెలా దారిదీసిందో తెలిసివచ్చింది. ఈ సభలో పాల్గొన్న తెలికిచర్ల వెంకటరత్నం, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, మల్లంపల్లి సోమశేఖరశర్మ కొన్ని విషయాలలో కరుడుగట్టిన పండిత తత్వం విడనాడి వుండవచ్చుగాని, హేతువాద వైఖరితోపాటు సామాజిక వ్యవస్థా పరివర్తన దృక్పథం కలిగినవారని చెప్పడం కష్టం. కనీసం తాపీ ధర్మారావు లాంటివారైనా కాదు జమ్మలమడక మాధవరామశర్మ సంగతి చెప్పేపనేలేదు కార్యదర్శివర్గంలో దూరివచ్చిన ప్రయాగ కోదండరామశాస్త్రి ఆ సంప్రదాయంనుంచి పూర్తిగా తప్పుకోనేలేదు. ఈ మహాసభ ఎన్నుకొన్న కార్యవర్గంలో సభ్యులు- తెలికచర్ల వెంకటరత్నం, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, అడివి బాపిరాజు, సెట్టి ఈశ్వరరావు, భద్రిరాజు భద్రిరాజు, మల్లవరపు విశ్వేశ్వరరావు, మద్దుకూరి చంద్రశేఖరరావు, చాగంటి సోమయాజులు, పి. వి. శివయ్య, విద్వాన్ విశ్వం, షేక్ ఫరీద్, నేదునూరి గంగాధరం, తెన్నేటి సూరి, కొత్తపల్లి లక్ష్మయ్య, వట్టికోట ఆళ్వారుస్వామి, దేశిరాజు కృష్ణశర్మ, అయల సోమయాజుల నరసింహశర్మ, నాగభైరవ శివరామకృష్ణయ్య, మహీధర రామమోహనరావు, ముద్దుకృష్ణ, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, ఆళ్ళ చలమదాసు, అత్తలూరి సర్వేశ్వరరావు, పట్టికొండ విశాలాక్షి, చదలవాడ

పిచ్చయ్య. కార్యదర్శి తుమ్మల వెంకటరామయ్య. సహాయ కార్యదర్శులలో ప్రియా గతోబాబు కొమరాజు వినాయకరావు ఉన్నాడు, పండిత సంప్రదాయాన్ని ధిక్కరిస్తూ కొంతమేరకైనా ప్రజాసామిక దృక్పథం చూపెట్టే రచనలు చేసిన ముద్దుకృష్ణ వంటి వారినీ, సోషలిస్టు భావాకర్షణకు గురై నవ్యసాహిత్య పరిషత్ పరిధినుంచి బైటపడ సాగిన ఏల్చూరి వంటివారినీ, కమ్యూనిస్టు ఉద్యమంతో మమేకమైనవారినీ తప్పిస్తే, అలంకారంకోసమో ప్రతిష్ఠకోసమో కొందరినైనా తెచ్చి కూర్చోబెట్టడం జరిగింది. సరైన విచక్షణ వాడినట్టు కనిపించదు. ఇదంతా పార్టీకి తెలీకుండా జరిగిందేమీకాదు.

సామ్రాజ్యవాద, ఫాసిజం వ్యతిరేక రచయితల సంఘం ఎలాగుండాలో, సాంస్కృతిక పోరాటసాధనంగా ఎలా ఉపకరించాలో ఆలోచించిన మీదటే, ఈ విధానాన్ని అవలంబించలేదనిపిస్తుంది. సంస్కృతిరంగంలో కూడా జోషీపంథా పర్యవసానం మరోవిధంగా ఉండదు. బూర్జువా సంస్కరణవాదానికి తలతాకట్టు పెట్టుకునే పార్టీ విధానానికి అనుగుణంగానే ఉంది, సామ్రాజ్యవాద వ్యతిరేకత అంటే బూర్జువా జాతీయవాదాన్ని తలదాల్చడంకాకుండా, కమ్యూనిస్టు పార్టీ తన బలాన్ని పెంచుకుంటూ దానికి ప్రత్యామ్నాయశక్తిగా రూపొందడమేనన్న అవగాహన లోపించింది. అలాగే ఫాసిజం వ్యతిరేకత అంటే వలసాధిపతులతో సహకరించడమన్నది కూడా దురవగాహనే. సాంస్కృతికరంగంలో ఐక్యసంఘటన అన్నప్పుడు, రాజకీయ కర్తవ్యాలగురించి గూడా స్పష్టత అవసరం. వివిధ వర్గాలకూ భావధోరణులకూ చెందిన రచయితలు ఒక సంఘంగా ఏర్పడక తప్పనప్పుడు, కమ్యూనిస్టు రచయితలు తదితరులతో సర్దుకుపోయే వైఖరిని గాకుండా, రాజీలేని పోరాటంద్వారా ఐక్యతను సాధించి కొనసాగించగల వైఖరినే అవలంబించ వలసి వుంటుందని 1935 తర్వాత చైనాలో ఏర్పడిన రచయితల సంఘం నిరూపించింది. పేరిస్ మహాసభ నాటికే ఫ్రాన్సులో సోషలిస్టు, కమ్యూనిస్టు రచయితలకు విడిగా ఒక సంఘం వుండేదని సజ్జాద్ జహీర్ స్వయంగా రాసివున్నాడు. మన దేశంలో అ.ర.సం. ఏర్పడ్డాక, బుద్ధదేవ్ బసూవంటి కేవల వ్యక్తివాదులను కూడ గట్టినట్టుగానే యూరపులోకూడా ఆంద్రే జీద్ లాంటివారిని చేర్చుకోవడం జరిగింది. రవీంద్రనాథ్ టాగూర్ సాహిత్యాన్ని విమర్శగా పరిశీలించే ధోరణిని కూడా రాల్ఫ్ ఫాక్స్ నిరసించినట్టు తెలుస్తుంది. అంటే, ఒకరచయితలో మేలైన అంశాలనే దృష్టిలో వుంచుకోవాలని మాత్రమే ఫాక్స్ అభిప్రాయం. రచయితలకు చీటీలుకట్టి మొత్తంగానే తోసివేసేవైఖరి మంచిదికాదన్నాడు. అంధ్ర అభ్యుదయ రచయితల సంఘంలో

క్రమంగా పెద్దరికంపొందిన రచయితలు కమ్యూనిస్టేతరులు గనకనే వారిని వెలిబెట్టి వుండవలసిందని ఎవరూ అనరుగాని, సామ్రాజ్యవాద వ్యతిరేకత, ఫాసిజం వ్యతిరేకత వంటి ముఖ్యవిషయాలలో వారికి నిజమైన శ్రద్ధ, పట్టుదల వున్నాయా, లేదా అన్నదే, గీటురాయి అయివుండవలసింది.

ప్రపంచయుద్ధం ముగుస్తూన్న రోజుల్లో అ.ర.సం. మూడో మహాసభ రాజమండ్రిలో 1945 డిసెంబరు చివరిరోజున, 1946 జనవరి మొదటి రెండు రోజుల్లోనూ జరిగింది. సభాధ్యక్షుడు దేవులపల్లి కృష్ణశాస్త్రి, ప్రారంభకుడు. శ్రీ శ్రీ. మిలిటరీ వుద్యోగంచేసి తిరిగి వచ్చాకనే నేరుగా అ ర.సం.లో శ్రీ శ్రీకి సంబంధం ఏర్పడింది. అప్పటికి మూడునాలుగేళ్లనుంచి వలసాధిపతులతో రాజ్యాధికారానికి సంబంధించి రాయబారాలు సాగుతున్నాయి. మతకలహాలు చెలరేగాయి. తెలంగాణా రైతాంగం కదలబారింది. ఇలాంటి పరిస్థితిలో అ.ర.సం. ప్రణాళికను మార్చవలసి వచ్చింది.

"శిథిలమైపోతున్న పాతప్రపంచం స్థానే క్రొత్త ప్రపంచం నిర్మించటానికి బహుముఖాలుగా తీవ్రకృషి జరుపుతున్న ఈరోజులలో సారస్వతవేత్తలు తమమహత్తర కర్తవ్యాలను గుర్తించి వాటిని బాధ్యతతో నిర్వర్తించవలసివుంది. అభ్యుదయనిరోధకతత్వం గట్టిదెబ్బ తిన్నది. కాని పూర్తిగా నశించలేదు సామ్రాజ్యవాదం, పరపీడనా తత్వం, సామాజిక సంకుచిత తత్వం మొదలయిన అభివృద్ధినిరోధకశక్తులు ఆదర్శ ప్రపంచ నిర్మాణానికీ ప్రజాసంస్కృతివ్యాప్తికీ అడుగడుగునా ఆటంకాలు కల్పిస్తున్నాయి. ప్రపంచంలో సాంఘిక దాస్యమూ పారతంత్ర్యమూ రాజకీయ బానిసత్వమూ ఉన్నంతకాలం మానవసంస్కృతికి వికాసంలేదు. అందుచేత ఈ అభివృద్ధినిరోధక శక్తులకు వ్యతిరేకంగా నిలబడి దాస్యవిచ్ఛేదనం కోసం. స్వేచ్ఛాప్రపంచ నిర్మాణం కోసం, న్యాయమయిన సామాజిక ఆర్థిక రాజకీయ వ్యవస్థలకోసం, సుఖమయజీవనం కోసం, విజ్ఞానవికాసంకోసం ముందుకుసాగిపోతున్న ప్రజాసమూహాలపక్షం వహించి. వారి మనస్థయిర్యాన్ని దిట్టపరచి, వారికిఉత్సాహం ఉత్తేజం కలిగించి కార్యాచరణకు ప్రోత్సహించడం తమ ప్రధానకర్తవ్యమని అభ్యుదయ రచయితలు గుర్తించుతున్నారు.

శీఘ్రగతిని రూపొందుతున్న స్వతంత్ర ప్రజాస్వామ్య ప్రపంచంలో సగౌరవస్థానాన్ని పొందగలగిన స్వతంత్ర భారత సమాఖ్యను నిర్మించడమే భారత ప్రజల పవిత్రాశయం. ఆ ఆశయసిద్ధి కోసం కావించే కృషిలో అభ్యుదయరచయితలు పాల్గొంటారు. ఆకృషిని ప్రోత్సహిస్తారు.

ఈ భావి భారత సమాఖ్యలో స్వతంత్ర ఐక్య ఆంధ్రదేశం సమాన ప్రతిపత్తిగల భాగస్వామిని కావాలి, ఇలాంటి ఆంధ్రి జాతీయైక్యతా చైతన్యాన్ని ఆంధ్రి ప్రిజలలో అభివృద్ధిచేసి, సౌఖ్యమయాంధ్రిజీవితాన్ని నిర్మించగల రచనలను సాగించడానికి ఆంధ్రి అభ్యుదయ రచయితలు అకుంఠితదీక్షతో పనిచేస్తారు.

ప్రిజలజీవితంతోను ప్రిజల ఉద్యమాలతోను సన్నిహితమైన ప్రిజాజీవిత సమస్యలను సాహిత్య వస్తువుగా అభ్యుదయరచయితలు స్వీకరిస్తారు. సాహిత్యంలో అభ్యుధయ నిరోధకతత్వాన్ని అరికట్టడానికై అభ్యుదయరచయితలు కృషిచేస్తారు. కులమతకక్షలు జాతివిద్వేషం, ప్రిజాపీడన, స్వాతంత్ర్యనిరోధం, మూఢవిశ్వాసాలు వీటిని ప్రోత్సహించే వాిిల్ని అభ్యుదయరచయితలు ప్రతిఘటిస్తారు."

"విశ్వశ్రేయఃకాంక్షతో, సత్యాన్వేషణ తత్పరతతో, సంఘజీవితమూ దాని వర్తనమూ దర్శించి సారస్వతంలో ప్రతిబింబింపజేసి, ఉజ్వలభవిష్యత్తుకు దారిచూపే ఉత్తమ సారస్వతాన్ని సృష్టించడం అభ్యుదయరచయితల ఆశయం. ఈ ఆశయసిద్ధికై భారతీయ నాగరికతలోని ఉన్నతసంప్రిదాయాలను స్వీకరించి, అభివృద్ధినిరోధకతను నిరాకరిస్తూ కృషిచేస్తారు. సారస్వతాన్ని ప్రిజాజీవితానికి సన్నిహితపరచి, చైతన్య దాయకంగా విశ్వశ్రేయస్సాధనంగా ఆనందదాయకంగాచేసి, కావ్యమునకు పరిపూర్ణ తను సిద్ధింపజేయుటకయి అభ్యుదయరచయితలు పాటుపడుతారు."

"విశ్వశ్రేయం" వగైరా ముసుగుమాటలు బహుళంగానే ఉన్నా ఈ ప్రణాళిక వాస్తవానికి మరింత చేరువగా రూపొందగలగింది. ప్రాంతీయత మొదలు అంతర్జాతీయతదాకా, కులమత సంకుచిత తత్వాల మొదలు స్వేచ్ఛాప్రపంచం దాకా ఎన్నో అంతస్తులలో రచయితల కర్తవ్యాలను నిర్దేశించింది. అయితే వర్గ పోరాటాలతో గూడిన కఠోరమైన జీవన వాస్తవాన్ని మరుగుపరిచేలా ఉదారవాద భావాలను ప్రకటించడం ద్వారా, సంస్కరణవాదభ్రమలనుంచి ఇంకా బైటపడనట్టు తెలుస్తూనేవుంది.

చదలవాడ పిచ్చయ్య కార్యదర్శిగా, కొడవటిగంటి కుటుంబరావు, జలసూత్రం రుక్మిణీ నాథశాస్త్రి సహాయ కార్యదర్శులుగా, రాజమండ్రి మహాసభలో ఎన్నికైన కార్యవర్గంలో సభ్యులు తెలికిచర్ల వెంకటరత్నం, దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీ. శ్రీ., వాగంటి సోమయాజులు, ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి, కామరాజు వినాయకరావు, దేశిరాజు కృష్ణశర్మ, తెన్నేటి సూరి, విద్వాన్ విశ్వం, తుమ్మల వెంకటరామయ్య,

అయల సోమయాజుల నరసింహశర్మ, భద్రిరాజు భద్రిరాజు, పోలూరి ఆంజనేయ ప్రసాద్, పైడి వెంకటరావు, అత్తలూరి సర్వేశ్వరరావు, ముక్కామల నాగభూషణం, మల్లవరపు విశ్వేశ్వరరావు, సుంకర సత్యనారాయణ, వట్టికోట ఆళ్వారుస్వామి, నాజర్, ప్రయాగ కోదండరామశాస్త్రి. నవ్యసాహిత్యపరిషత్తులో మరీకరుడుగట్టిన సరుకు తప్ప తక్కినది అరసం లోకి వచ్చినట్టు ఈ జాబితానుబట్టి చెప్పవచ్చు. ప్రణాళికలోని మితవాద వైఖరికి ఇదికూడా కొంతైనా కారణం. 1946 మే, జూన్ మాసాలలో నెలరోజులపాటు పెదపూడిలో అ.ర.సం. నడిపిన ఆంధ్రసాహిత్య పాఠశాల నూరి పోసింది ఎక్కువగా సాంప్రదాయిక వైఖరినే. దేశచరిత్ర, భాషా చరిత్ర, అలంకార శాస్త్ర విషయాల గురించి ఆ వైఖరితోనే పాఠాలు చెప్పడం జరిగింది. సమకాలిక సాహిత్యధోరణుల గురించి శ్రీ.శ్రీ., కొ. కు. వంటి ఒకరిద్దరు ప్రసంగించినా, మొగ్గు అటువైపే.

నాలుగో మహాసభ 1947 జనవరి 18–19 తేదీల్లో మద్రాసులో జరిగింది. వింజమూరి గోవిందరాజాచారి ఆహ్వాన సంఘాధ్యక్షుడు. పి. వి. రాజమన్నారు సభాధ్యక్షుడు. ఎన్నికైన కార్యవర్గంలో దేవులపల్లి కృష్ణశాస్త్రి, తెలికిచర్ల వెంకటరత్నం, మల్లంపల్లి సోమశేఖరశర్మ, గిడుగు సీతాపతి, చిలుకూరి నారాయణరావు, కొ. కు., ఇంద్రకంటి, అ. న. శర్మ, చా. సో., శ్రీ. శ్రీ., తెన్నేటి సూరి, తుమ్మల, అత్తలూరి, కోగంటి గోపాలకృష్ణయ్య, రాటకొండ నరసింహారెడ్డి, పులుగుండ్ల రామకృష్ణయ్య, కొంగర జగ్గయ్య, నాజర్, సుంకర, ఆవిసెట్టి సుబ్బారావు, మోటుపల్లి రామానుజరావు, జి. ప్రభ సభ్యులు. ప్రజానాట్యమండలికి ప్రాతినిధ్యం తగినంతగానే ఉంది. మొట్ట మొదటి కార్యవర్గంతో ఉండినవారు కొందరు రచయితలైనా కాకున్నా కొనసాగుతున్నారు. కొత్తతరం దాదాపుగా నిర్లక్ష్యం పాలయింది. ఎంతగా కలిపివస్తున్నారనుకున్నా, ప్రధానంగా సాంప్రదాయక దృక్పథంగలవారి సంఖ్య అపూర్వంగా పెరిగింది. మదరాసు మహాసభకు విశ్వనాథ సత్యనారాయణ కూడా సందేశం పంపగలిగాడు. నవ్యసాహిత్యపరిషత్తు మూలబడి పోతూ సొంత వేదిక పోగొట్టుకుంటున్నప్పుడు, అ. ర. సం. వేదికను తెలివిగా వాడుకొన్నదని నార్ల వెంకటేశ్వరరావు చేసిన వ్యాఖ్య అర్థవంతమే అయింది. మద్రాసు మహాసభ "మన" మహాసభలాగా జరగలేదంటూ పార్టీ అభిమానులు రాష్ట్రపార్టీ కార్యదర్శికి రాశారు. చదలవాడ పిచ్చయ్య నిర్వాకంలో సంస్థ తన విశిష్టతను కోల్పోసాగింది. అభ్యు [illegible] ఆరితేరి ప్రసిద్ధి పొందినవారు కారు గనక అను

భవంగలిగిన వారినుంచి నేర్చుకోక తప్పదంటూ ఆయన చేసిన వాదం అభ్యుదయానికి మంగళం పాడినట్టయింది. మరి ప్రజానాట్యమండలి రచయితలు ఏవో కొన్ని "జానపద" గీతాలురాసే రచయితలేనని తేలిక చెయ్యగలిగాడంటే వింతలేదు.

ప్రభుత్వహస్తం త్వరలోనే బలంగా పడబోతున్నదని మద్దుకూరి చంద్రశేఖర రావు ముందుగానే హెచ్చరించాడు. తెలంగాణా పోరాటం తీవ్రతరం కావడం ఒక్కటే దీనికి కారణంకాదు. కలకత్తాలో పార్టీ రెండో మహాసభ రణదివే అతివాద దుస్సాహసికపంథాను ఆమోదించి, ఆచరణలో పెట్టజూడడంతో, కేంద్ర ప్రభుత్వం కూడా విరుచుకుపడింది. ప్రకాశం ఆర్డినెన్సు జారీఅయింది. పార్టీ నిషేధానికి గురైంది. ఈదెబ్బ అ ర.సం.కు కూడా తగిలింది. దాని నిజమైన బలానికి ఇదిపరీక్ష. నిన్నటి దాకా మూకలుగట్టి అ.ర.సం.లోకి వచ్చినవాళ్లు 'ఎక్కడి దొంగలక్కడే' నన్నట్టు మటుమాయమయ్యారు. పార్టీ రచయితలూ కళాకారులూ జైళ్లకో రహస్య జీవితానికో పోవలసివచ్చింది. నిర్బంధకాండతో అ.ర.సం. కరిగిపోయింది. ఇలాంటి చారిత్రిక సన్నివేశంలో అ.ర.సం. కార్యదర్శి పిచ్చయ్య పరమ మితవాదవైఖరి ప్రదర్శించాడు. అప్పటికే వ్యక్తిగత కక్షలుమూలకారణంగా పార్టీనాయకత్వంమీద ధ్వజమెత్తివున్నాడు. 'అభ్యుదయ' పత్రిక మొదటి ఎనిమిది సంచికలలో తెలంగాణా పోరాటానికి సంబంధించిన రచనలు లేనేలేవు. రాజమండ్రిలో కార్యవర్గ సభ్యుడుగా ఎన్నికైన ఆళ్వారుస్వామి అరెస్టుఅయితే, మద్రాసుమహాసభలో గోవిందరాజాచారి వంటివారి అభ్యంతరం కారణంగా, నిరసన తీర్మానంకూడా చేయించలేకపోయాడు. 'మాభూమి' నాటకం గురించి 'అభ్యుదయ'లో ఘోరమైన సమీక్షరాయించి ప్రకటించాడు. సహాయ కార్యదర్శి ప్రయాగ పిచ్చయ్య మంత్రాంగంలో ఆయనకుకుడిభుజమయ్యాడు. అనిసెట్టి, గోఖలే వంటివాళ్లు నీళ్లనమీలారు. చివరకు పిచ్చయ్య, ప్రయాగ పార్టీ క్రమశిక్షణ చర్యకుగురై అ.ర.సం. బాధ్యతనుంచి గెంటించుకున్నారు. త్వరలో సంస్థేమూత బడింది. పత్రిక నిలిచిపోయింది. అయితే అభ్యుదయ రచనలుమాత్రం ఆగిపోలేదు. నిజానికి అభ్యుదయరచనలు పుస్తకరూపం ధరించింది. 1948 తదనంతరమే. శ్రీ. శ్రీ. 'మహాప్రస్థానం.' ఆరుద్ర 'త్వమేవాహం.' సోమసుందర్, 'వజ్రాయుధం.' రమణారెడ్డి, 'అడవి' గంగినేని, 'ఉదయిని' వగైరా వీటిలో ముఖ్యమైనవి. అలాగే 'విశాలాంధ్ర' పక్షపత్రిక 'ఉదయిని' 'అరుణరేఖ' 'సంధ్య' వంటి పత్రికలు నడిచాయి.

తెలంగాణా సాయుధపోరాటానికి ద్రోహం జరిగాక. వెనువెంటనే కమ్యూనిస్టు ఉద్యమం అరణ్యవాసంనుంచి బైటపడలేదు. కొరియాయుద్ధంలోనూ ఇతరత్రానూ

నెహ్రూప్రభుత్వ విదేశాంగవిధానంలో తనకు అనుకూలమైన అంశాలున్న దృష్ట్యా, క్రమేపీ సోవియట్ యూనియన్ నెహ్రూప్రభుత్వంపట్ల స్నేహపైఖరి చూపసాగింది. అందుచేత మన కమ్యూనిస్టు పార్టీకూడా ఈ చేదుమాత్రను మింగింది. 1952 ఎన్నికల్లో మనరాష్ట్రంలో గణనీయమైన విజయం పొందింది. పార్లమెంటరీ పంథా మీద గురి కుదరసాగింది. పోరాటాలకూ త్యాగాలకూ ప్రజలిచ్చిన గుర్తింపుగా దాన్ని అర్థం చేసుకునివుంటే, బూర్జువా వర్గనాయకత్వానగల రాజ్యాధికారానికి వ్యతిరేకంగా పోరాట పంథాలోనే నిలిచివుండేది. తెలంగాణాలో తలబొప్పి కట్టాక, రణదివే పంథాతో అతిత్వరలో బుద్ధివచ్చాక, అవసరంకొద్దీ సాయుధ ప్రజాపోరాటశక్తిగా తన అయోగ్యతకొద్దీ బూర్జువా పార్లమెంటరీ ప్రజాస్వామిక మాయాజాలానికి స్వార్పణం చేసుకుంది. సోషలిజానికి శాంతియుత పరివర్తన సాధ్యమేనంటూ. 'జాతీయ' ప్రజాస్వామికాన్ని నూతన ప్రజాస్వామికానికి మార్గాంతరంగా ప్రతిపాదించిన కృశ్చేవ్ రివిజనిజాన్ని సంతోషంగా తలదాల్చింది. 1955లో మనరాష్ట్రంలో వచ్చినమధ్యంతర ఎన్నికలలో ప్రభుత్వాధికారాన్ని కైవసం చేసుకోగలననికూడా భ్రమపడింది. ఈ పరిస్థితిలో 'కాంగ్రెస్ ఫర్ కల్చరల్ ఫ్రీడం' అనే సామ్రాజ్యవాద సాంస్కృతిక సంస్థ రంగంలోకి దిగిన దరిమిలా, తెలుగు దినపత్రికలు కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారాన్ని వుధృతం చేశాయి. వ్యక్తిస్వేచ్ఛనూ భావప్రకటనా స్వాతంత్ర్యాన్నీ పరిరక్షించే పేరుతో తెలుగురచయితలలోనూ కళాకారులలోనూ అనేకులు తమ అసలురంగు బైట వేసుకున్నారు. ఇటీవలిదాకా అభ్యుదయ సాహిత్యోద్యమంతో పూసుకుతిరిగినవాళ్లు కూడా ఈ ప్రచారయుద్ధంలో పాల్గొన్నారు. ఆ ఎన్నికలలో మన్నుగరచినా కమ్యూనిస్టులకు బుద్ధిరాలేదు సరిగదా, ఏ మాత్రమైనా మిగిలివుంటే అది పూర్తిగా పోయింది. అమృత్‌సర్ సమావేశంలో కమ్యూనిస్టుఉద్యమం విప్లవశక్తిగా తన ఆత్మహత్యను పూర్తి చేసుకుంది.

లోగడ ఒకటి రెండేళ్లనుంచి అ.ర.సం.ను మళ్ళీ నిర్మించాలనే ఆలోచనలు 1955 జూలై చివరకు ఫలించి, విజయవాడలో ఐదో మహాసభ జరిగింది. శ్రీ. శ్రీ. అధ్యక్షత వహించాడు. తుమ్మల కార్యదర్శిగా ఒకకార్యదర్శి వర్గం ఏర్పడింది. కొ. కు. ఉపాధ్యక్షుడు. గోఖలే, సుంకర. కుందుర్తి ఆంజనేయులు, ధనకుధరం వెంకటాచార్య, కొరుమంచి వెంకటేశ్వరరావు, పి. లక్ష్మీకాంతమోహన్, బి. వి. నరసింహారావు, రెంటాల గోపాలకృష్ణ, శ్రీనివాస చక్రవర్తి, ఉప్పల లక్ష్మణరావు, రాంభట్ల కృష్ణమూర్తి, నార్ల చిరంజీవి, కవులూరి వెంకటేశ్వరరావు, సోమసుందర్,

గంగినేని వెంకటేశ్వరరావు, కె. వి. రమణారెడ్డి, పూసపాటి కృష్ణంరాజు, ఆకెళ్ళ కృష్ణమూర్తి, డి. ఎ. ఎ. యస్. నారాయణరావు, కాళోజి, పాములపాటి సదాశివరావు, యం. శివనాగయ్య కార్యవర్గ సభ్యులయ్యారు. కొత్తనెత్తురువాలాపట్టింది. సాంప్రదాయికులపట్టునుంచి సంస్థ బైటపడింది. నిర్మాణంలో మరింతక్రమబద్ధత ఏర్పడింది. త్రైమాసికగానైనా పత్రిక మళ్ళీ మొదలైంది. ప్రణాళికగూడా మారింది.

"గడచిన అర్ధశతాబ్దిలోను అనేక సాహిత్యసంస్థల నిరంతర కృషి ఫలితంగా ఆంధ్రసాహిత్యం పునరుజ్జీవనం పొంది ఒక ఉన్నతస్థాయి నందుకొన్నది. ముఖ్యంగా సాహితీ సమితి, నవ్యసాహిత్యపరిషత్తు, అభ్యుదయ రచయితల సంఘం మొదలైన సంస్థల సభలు, సమావేశాలద్వారాను, పుస్తక, పత్రిక ప్రచురణలద్వారాను మన సాహిత్యంలో గొప్పమార్పును తీసుకొచ్చాయి.

అభ్యుదయ రచయితల సంఘం ఆంధ్ర చరిత్రలో నవ యుగవైతాళికులైన కందుకూరి, గురజాడ, గిడుగు మొదలగువారి ఉత్తమ సంప్రదాయమునను సరించి, సాంఘిక శ్రేయస్సే సాహిత్యం యొక్క ప్రధాన లక్ష్యమని గుర్తించి, సజీవమైన సాహిత్యసృష్టికి కృషిచేసింది. ప్రాచీన, అధునాతన సాహిత్యాలలోని ఉత్తమ లక్షణాలను స్వీకరించి, ఆంధ్రసాహిత్యంలో ఒక నూతన రచనా సంప్రదాయమును పాదుకొల్పింది. దేశిసాహిత్యరీతులను పునరుద్ధరించడానికి సమకాలిన జీవితాన్ని ఆయారూపాలలో చిత్రించి, ప్రచారంచేసి, ఆంధ్ర ప్రజల ఆదరాభిమానాలను పొందగలిగింది. సాంఘిక జీవితానికి దూరమైన సాహిత్యధోరణులను విడనాడి, ప్రజల జీవితసమస్యలను కావ్యవస్తువులుగా గ్రహించి, ప్రగతి శక్తులకు చేదోడు వాదోడుగానిలిచి, తెలుగు జాతికి వెలుగుదారి చూపింది.

కాని యిటీవల కొన్ని సంవత్సరాలనుండి అభ్యుదయరచయితల సంఘం ఒకసంస్థగా పనిచేయలేకపోయింది. దీని ఫలితంగా ప్రస్తుతం మనసాహిత్యంలో ఒకవిధమైన నిస్తబ్ధత, నిరుత్సాహమూ ఆవరించి, దేశాభ్యున్నతికి తోడ్పడే ఉత్తమ సాహిత్యసృష్టి నీరసించిపోతున్నది. అందుచేత నవోత్సాహంతో సాహిత్య కృషిని ప్రారంభించే యువరచయితలుగూడా ప్రగతిశీలమైన దృక్పథం అలవరచుకోలేక పెడతోవలుపట్టి, అసలు సాహిత్య సృజనాశక్తియే నిర్జీవమైపోయే ప్రమాదం ఏర్పడింది.

ఈ పరిస్థితిని గమనించి, మన సాహిత్యాన్ని సక్రియమైన ప్రగతిమార్గాన పెంపొందించడానికి అభ్యుదయరచయితల సంఘాన్ని పునర్నిర్మించడం అత్యవసరమని భావిస్తున్నాము.

"మన సాహిత్యాభివృద్ధికి కృషిచేయడానికి అభ్యుదయరచయితల సంఘం యీ క్రిందనుదహరించిన ఆశయాలను అమలులోపెట్టడం అవసరమని నమ్ముతున్నాము.

"-ప్రస్తుత సమాజంలో జరుగుతున్న నిత్యసంఘర్షణలో వర్ధమాన శక్తులకు దోహదంచేసే సాహిత్యసృష్టికిపూనుకొని ఆంధ్రజాతి అభ్యున్నతికి తోడ్పడటం మన ధర్మమని భావిస్తున్నాము.

"-నేటి పరిస్థితులను సమగ్రంగా అవగాహనచేసుకొంటూ, వాస్తవికదృష్టితో ప్రజల నిత్యజీవితాన్ని వివిధకళారూపాలలోనూ ప్రతిఫలింపజెయ్యడానికి కృషిచేస్తాము.

"-పూర్వసాహిత్యపఠనమూ, పరిశోధన శ్రద్ధాసక్తులతో సాగించి, మనసంస్కృతిలోని విశిష్ట సంప్రదాయాలను పొందుపరుచుకుంటూ రచనలు చెయ్యడానికి ప్రయత్నిస్తాము.

"-మనదేశంలోనూ, యితరదేశాలలోనూసాగుతున్న సాహిత్యకృషిని గమనిస్తూ, దానిలోని ఉత్తమ లక్షణాలను, రీతులను స్వీకరించడం ద్వారా మనసాహిత్య వికాసానికి కృషిచేస్తాం.

"-మన రచనలలో నిరర్థకమైన విశృంఖలతకుగాని, ప్రయోజన రహితమైన శృంఖలాబద్ధతకుగాని తావివ్వక, వస్తువుకు, శిల్పానికి చక్కని సమన్వయం సాధించి ఉత్తమకళాఖండాలను సృష్టించడానికి ప్రయత్నిస్తాము.

"-మన సాహితీ పరులు తాముకృషిచేస్తున్న వివిధ శాఖలలోను పరిశోధనలు జరిపి, వ్యాసాలు, విమర్శనలు ప్రకటించడం ద్వారా, ఆంధ్రప్రజలలో విజ్ఞానవ్యాప్తికి ప్రయత్నించడం అవసరమని భావిస్తున్నాము.

"-కొత్తగా సాహిత్యజగత్తులో ప్రవేశించేవారి రచనలను ప్రత్యేక శ్రద్ధతో పరిశీలించి సానుభూతితో ప్రోత్సహించడం ప్రతిసాహితీపరుని ధర్మంగా ఎంచుతున్నాము.

"ఈ ఆశయసాఫల్యతకోసం పత్రికలు, పుస్తకాలు ప్రచురించడానికి, సభలు, చర్చలు జరపడానికి, మరి యితరవిధాలుగా ప్రయత్నించడానికి అభ్యుదయరచయితల సంఘం ఎప్పటికప్పుడు కార్యక్రమం నిర్ణయించుకొని కృషిచెయ్యగలదనీ, ఆంధ్ర చరిత్రలో ఒక మహత్తరాధ్యాయాన్ని రచించగలదనీ నమ్ముతున్నాము."

వెనకటి ప్రణాళికలకూ దీనికీ మౌలికమైన భేదంలేకపోయినా, మాటల్లో వచ్చిన మార్పు గమనించదగింది. 'విశ్వశ్రేయస్సు' 'సంఘశ్రేయస్సు' అయింది. సమాజ సంఘర్షణల్లో వర్ధమానశక్తులకు దోహదం చెయ్యాలనే లక్ష్యంకూడా కొత్తదే. సంప్రదాయాన్ని వివేచించి, "దేశి" లక్షణాలుగల ధోరణిని పునరుద్ధరించాలనే సంకల్పమూ అంతే, అయితే పూర్వసాహిత్యాన్ని మొత్తంగానే తలకెత్తుకునే ధోరణిగానీ, ప్రత్యేకించి ఆంధ్రప్రాంతానికి పరిమితమైన రాష్ట్రనిర్మాణ వాంఛను ప్రజాపరంగా విశ్లేషించి చూడని వైఖరిగానీ మెచ్చదగినవికావు. కొత్తరచయితలను ప్రోత్సహించడం పూర్వసాహిత్యధోరణులను మప్పడానికే అయితే ఆపనిచేసేందుకు అ.ర.సం. అక్కరేలేదు. యువరచయితలను పెడదారులనుంచి మరలించేందుకు ఏమిచెయ్యవలసివుందో ప్రణాళిక సూచించలేదు. ప్రణాళికలో మంచి ఏకొంచెమైనా వుంటే అది సంస్థకార్యకలాపాలలో చురుగ్గా పాల్గోసాగిన యువకుల కృషిఫలితమే. అయితే వీరుకూడా పూర్వసాహిత్యం పేరున నన్నయభట్టు మొదలు ప్రబంధకవుల దాకా తెలుగుకవుల పద్యాలను ఏరి పండితులచేత లఘువ్యాఖ్యలురాయించి అచ్చు వేయించబూనారు. కాని, కొత్తకవులకు ప్రోత్సాహంకూడా ఇచ్చారు, తెలుగులో సాహిత్యోద్యమాలమీద రాజకీయోద్యమ ప్రభావం గురించి విమర్శ దృక్పథంతో వ్యాసాలు ప్రకటించారు. ప్రపంచశాంతి ఉద్యమానికి బలంగానే స్పందించారు. అయినా రాజకీయ అవగాహనను పెంపొందించుకోలేదు సరిగదా, అ.ర.సం.కు కమ్యూనిస్టుపార్టీతో ఉండవలసిన సంబంధం విషయంలో గతఅనుభవంనుంచి తప్పు గుణపాఠాలుతీశారు. అ.ర.సం. పేరుంవున్న 'సంఘ' శబ్దం ట్రేడ్‌యూనియన్‌ను సూచించేదిలాగుందని 'పరిషత్' అని పేరెట్టాలంటూ ప్రతిష్ఠకోసం పెనగులాడేవ వారు లేకపోలేదు. ప్రపంచకమ్యూనిస్టు ఉద్యమంలో వెల్లువకట్టి రాసాగిన మార్పులను పట్టించుకోకపోవడమేగాక, దేశంలో పార్లమెంటరీ పంథా మూలంగా కమ్యూనిస్టుపార్టీ పాలకపక్షానికి ఎలా తోకగా మారుతూవుందో గమనించలేదు. చెదురుమదురుగా సాగిన ఆర్థిక పోరాటాలగురించి కొందరింకా కదలి రాస్తూవచ్చినా, కమ్యూనిస్టు ఉద్యమంలో

బలీయంకాసాగిన మితవాద వైఖరేసాంస్కృతిక రంగంలోకూడా ప్రతిఫలించింది. 1948 తర్వాత మద్రాసుకుపోయి సినీరంగంలో స్థిరపడిన రచయితలు, కళాకారులు ఎన్నికల సమయాలలో తప్ప పార్టీకార్యకలాపాలకు దూరమయ్యారు. శ్రీ శ్రీ 1952లో మద్రాసు శాసనమండలికి ఎన్నికయ్యాడు. సాహిత్య అకాడెమీ సభ్యత్వంకోసం తుమ్మల, సోమసుందర్ తహతహలాడారు. కొందరిని మార్క్సిజవాదం ఆవేశిస్తే మరి కొందరు వంటింటి పద్యాలకో కూనలమ్మ పదాలకో తమ సాహిత్యాన్ని మళ్లించారు. తిలక్ ప్రభావానికి కొందరు మంత్రముగ్ధులయ్యారు. అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు అంటూ ఒకసంస్థ ఆలంపురంలో సమావేశం జరిపిన సందర్భంగా అందులో అ.ర.సం.ను విలీనంచెయ్యాలనే ఆలోచనకూడా వచ్చింది. ఇలా 1958 నాటికి సంస్థను నిర్వహించడం, పత్రికను కొనసాగించడం ప్రయాసగా, పరిణమించింది. 'అభ్యుదయం' పేరే మిగిలింది. అ.ర.సం. లెటర్ పేడ్ మీదనే నిలిచింది. జీవధాతువు హరించుకుపోయింది. అది చావూ బతుకూగాని సందిగ్ధస్థితి. 1948లో నైతే హఠాత్తుగా స్తంభించిందిగాని, 1958 తర్వాత మాత్రం మంచంపట్టి తీసుకోసాగింది.

(ముగింపు వచ్చే సంచికలో)

## కరపత్రాలు కావాలి

ప్రజా సమస్యలకు, ఉద్యమానికి సంబంధించి మన రాష్ట్రంలో రోజు ఎన్నో కరపత్రాలు వస్తున్నాయి. పాఠకుల దృష్టికి వచ్చే అటువంటి కరపత్రాలను సృజనకు సేకరించి పంపించవలసిందిగా విజ్ఞప్తి.

— సాహితీమిత్రులు



భూస్వాములు జీతగాళ్ళ
జీతాలను కోసినారు

పూటగడవకుండ కూటి
కూలీలెగ్గొట్టినారు

తొత్తులతో కులసంఘా
లుద్ధరించి పెట్టినారు

కుమ్మక్కై పోలీసుల
తో నెత్తురు పిండినారు

మాల మాదిగలను బట్టి
చెట్లకిరిచి కట్టినారు

నక్సలైట్ల కన్నమెవడు
పెట్టెననీ కొట్టినారు

కమ్యూనిస్టు లెక్కడనీ
పిచ్చిపట్టి అరచినారు

కొత్తమనిషి కనిపిస్తే
నిద్రరాకచచ్చినారు
నిద్రరాకచచ్చినారు

* * *

పగలే పల్లెను పహారాకాసి
యమభటులవలె పోలీసొచ్చి
యువకులబట్టీ అరెస్టుచేసీ
రహస్యమేదో వెలిగక్కండని
గుడిసెలు పాకలు సోదాచేసి
కూలి పడుచులను కొరికీ చెరచీ
విప్లవమంటే ఉరితీస్తామని
అమాయకులను హింసలుపెట్టిరి
పార్టి మనుషులని పసిబిడ్డలను
పట్టికొట్టిరీ పోలీసు కంసులు
ఏది స్వరాజ్యం ఎవరిది రాజ్యం
చరిత్ర మరుగున దాగదు సత్యం

* * *

ఒక్కనాటితో అయిపోలేదు
భూస్వాముల కసి మసిగాలేదు
పగలు రేయీ రక్కపిదాడుల
గుండె జల్లదై విలపించింది
పిట్ట శోకమై వినిపించింది
పల్లె కాష్టమై కనిపించింది
గంటగంటకూ రోజురోజుకూ
గ్రామం గిలగిలలాడినది
మనసులు చెదిరీ దిక్కులుపగిలీ
మబ్బులు పలపల ఏడ్చినవి
యువతీ యువకుల కొరిన్నెత్తురు ఏ
అభ్యుదయానికి వెచ్చిస్తారో
పసిబిడ్డలనూ హింసలు పెట్టే
పాలన కాలం మూడినది
సూర్యుని చుట్టూ వలయం పన్నిన
ఆగదు ఆగదు సూర్యోదయమూ
నెత్తుటి ధారల ధరిత్రి తడిసిన
చావదు చావదు సత్యం చావదు

('గౌరమ్మకలలు,' కథాకావ్యం 1975 మార్చి నుంచి)

# కమ్యూనిస్టు ప్రణాళిక - ఒక చారిత్రిక పరిశీలన

త్రిపురనేని మధుసూదనరావు

మార్క్స్, ఏంగెల్సుల కమ్యూనిస్టుప్రణాళిక ప్రపంచ సాహిత్యంలో మహత్తర రచన. ప్రపంచ చరిత్రగమనానికి ఒక సజీవ రూపం, అవిభాజ్యమైన అనేక అవయవాలతో కూడిన అవయవి. ఏదో ఒక సామాజిక జీవితక్షేత్రానికి పరిమితమైంది కాదు. సమాజాన్ని దానిచలనంలో మార్పులో అంగాంగి రూపంలో ప్రణాళిక ప్రతిబింబించింది. ప్రణాళిక వాక్యాల సమూహంలో చరిత్ర జీవించింది. సమాజ భౌతికగతితర్క అగాధతలాల్ని ప్ర ణా ళి క పర్వతించింది. వచనం అనే పేరు వ్యవహారం లోకి రాకముందునుంచీ మానవులు వచనంలో సంభాషించి నట్టు గతితర్కం అనే పేరు శాస్త్రంలోకి రాకముందు నుంచీ మానవులు గతి తార్కికంగానే ఆలోచిస్తున్నారు. జీవిస్తున్నారు. ప్రపంచ తత్వశాస్త్ర, విజ్ఞాన శాస్త్రాలచరిత్ర గతి తార్కిక చైతన్యాన్ని పొందడానికి కొన్ని వేల సంవత్సరాలు పట్టింది. మానవాళి ప్రపంచాన్ని వివరించడానికి సుదీర్ఘకాలం ప్రయత్నించి ప్రపంచాన్నిమార్చడానికి చైతన్యవంతంగా పూనుకోవడంలో గతితర్కం ప్రభవించింది. ప్రపంచాన్ని వ్యాఖ్యానించడం ప్రపంచాన్ని మార్చడం వేరువేరుగా ఉన్నంతకాలం సమస్యలమీద ఇనుప తెరలు కప్పబడతాయి. ఈ రెండింటికలయిక కమ్యూనిస్టు ప్రణాళిక. ఇందులో ఏ ఒక వాక్యాన్నీ మరొకవాక్యంనుంచి విడదీయలేం. మనిషినుంచి చేతినో కన్నునో విడదీస్తే అవిచేయిగా కన్నుగావ్యవహరించలేవు, అవిమనిషి శరీరంలో అవిభాజ్యంగా ఉన్నప్పుడే వాటివాటి రూపంలో ఉండగలవు. వాటిపాత్రను నిర్వహించగలవు. కమ్యూనిస్టు ప్రణాళికలోని వాక్యాలూ,భావాలూ ఇలాంటి అవయవి-అవయవ సంబంధంకలిగినవే. భావాలు గతితార్కికంగా వాక్యరూపాన్ని పొందడానికి ప్రణాళిక పరమప్రమాణం. అన్యోన్య సంబంధంగల భావాలు వాక్యరూపంలో ఒకసారిలోతుగా, మరొకసారి విశాలంగా, ఒకసారిప్రశాంతంగా మరొకసారిప్రభంజనంగా ప్రవహించి నిరంతరం మారుతూ మహోన్నత దశకి చేరుకోవడానికి దాడిచేస్తున్న ఆయుధాల సమూహపుయుద్ధ ధ్వని ప్రణాళిక అంతటావ్యాపించిఉంది. మార్క్స్, ఏంగెల్స్‌కి ఇప్పుడుప్రపంచంలో ఉన్నస్థానం ఈ ప్రణాళిక మాత్రమే రాసినాఉండేది. గతితర్కం కేవల వాదపద్ధతికాదు. అది సిద్ధాంత ఆచరణల సమ్మేళనం. మోరిస్‌కారన్‌ఫోర్త్‌వంటి రివిజనిస్టులు గతి తర్కాన్ని ప్రకృతికీ సమాజానికీ అన్వయసూత్రాలుగా, ఒక విధానంగా మాత్రమే చిత్రిస్తున్నారు. గతితర్కం నిత్యజీవితవాస్తవాలకి సంబంధించిన సూత్రాలసముదాయం. గతితర్కం అంటే ప్రకృతి, మానవసమాజం, ఆలోచనల అభివృద్ధికి

చలనానికీ సంబంధించిన సాధారణ సూత్రాలశాస్త్రం అని ఏంగెల్స్ చెప్పాడు. వీటిని విడదీసి పరస్పర సంబంధంలేని విషయాలుగా పరిగణింపకూడదు. ప్రకృతి, మానవ సమాజం వాటికి సంబంధించిన ఆలోచన అవిభాజ్యాలు, ఈ అవిభాజ్యతనుంచి గతి తార్కిక సూత్రాల్ని ఆవిష్కరించాలి. సంబంధం అంటేనే రెండువస్తువుల మధ్య, ఒకవస్తువులోని రెండుఅంశాలమధ్య సంబంధంగాఉంటుంది. ఈ సంబంధం ఒక వస్తువు మరొకవస్తువుకి చెందిందిగాఉండదు. ఒకవస్తువు మరొకవస్తువును మారుస్తూ తానుమారుతూఉండడాన్ని సంబంధం అంటారు. అన్నివైపులనుంచీ నిరంతరచలనం లోని పరస్పరత అన్యోన్యసంబంధం. ఇదే భౌతికగతితర్కం. కమ్యూనిస్టు ప్రణాళిక కేవల శుష్కసిద్ధాంతపత్రంకాదు. కార్యక్రమసూచికకాదు. విప్లవసిద్ధాంత విప్లవ ఆచరణల సామాజిక అవయవి. ఆర్థిక, రాజకీయ, సామాజిక తాత్విక నైతిక సాంస్కృతిక అంశాల అన్యోన్యసంబంధాల మొత్తం. ప్రపంచానికి ప్రణాళిక కెలడీ స్కోప్. పతివాక్యం భౌతిక గతితర్కకొలిమిలో ఉత్పత్తిచేయబడిన ఆయుధం, చరిత్రని తవ్వుతుంది· సత్యాన్నివెలికితీస్తుంది. గమనాన్ని నిర్దేశిస్తుంది. పతనంకావలసినదాన్ని నిర్మూలిస్తుంది. విజయవంతం కావలసినదానికి మార్గం సుగమంచేస్తుంది. గందరగోళ సిద్ధాంతాన్ని తోసివేస్తుంది. నవప్రపంచ కవాటాన్ని తెరుస్తుంది.

కమ్యూనిస్టు ప్రణాళిక మార్క్స్, ఏంగెల్సు బుర్రలనుంచి ఒకరోజున ఊడి పడిందికాదు. అదివిభిన్న సామాజిక మూలాలనుంచి ప్రవహించిన అనేకభావ, భౌతికవాస్తవికతల సంగమం. పెట్టుబడిదారీ వ్యవస్థలోని అమానుషత్వం, కార్మిక వర్గపోరాటాలూ సామాజిక సమస్యల పరిష్కారానికి అనేకమంది మేధావుల సిద్ధాంతాలు కమ్యూనిస్టు ప్రణాళిక ఆవిర్భవించడానికి హేతువులు. మార్క్స్, ఏంగెల్సులు సమాజ క్రమాన్ని అవగాహన చేసుకొని, సిద్ధాంతీకరించే అపారమైన కృషి ప్రణాళికలో పరిపక్వమయింది. మార్క్స్, ఏంగెల్సులు ఒకరోజులోనే మార్క్సిస్టులు కాలేదు. 19వ శతాబ్దంలోని వాస్తవపోరాటాల్నీ సిద్ధాంతాల్నీ అధ్యయనం చేస్తూ తత్వశాస్త్రం, రాజకీయ-అర్థశాస్త్రం వర్గ పోరాట సిద్ధాంతాలను ఏకక్రమంలో ప్రాపంచికదృక్పథాన్ని రూపకల్పన చేశారు. మార్క్స్ Economic and Philosophic manuscripts, ఏంగ్సెలు Working class Conditions in England, మార్క్స్ ఏంగ్సెలు, The Holy Family, Theses on Fevrbach, The German Ideology, The Poverty of Philosophy, Contribution to the critique of Hegels Philosophy of Law వంటి గ్రంథాల్లో కమ్యూనిస్టు ప్రణాళిక రచనకి అవసరమైన సిద్ధాంత నేపథ్యం పూర్తిగానేఉంది. ఈరచనల్లో పరాయీకరణం, ఐడియాలజీ,

మతం, సివిల్ సొసైటీ, రాజ్యాంగ యంత్రాలమీద తాత్విక వివరణ మాత్రమే ఉందనీ వర్గపోరాట సిద్ధాంతం గురించి వివరంగా, దృఢంగాలేదనే మార్క్సియాలజిస్టుల, న్యూలెఫ్ట్ వాదుల సిద్ధాంతాలు పూర్తిగాతప్పు. జర్మనీ, ఫ్రాన్స్, ఇంగ్లండ్ లోని తాత్విక, రాజకీయ, ఆర్థిక పరిస్థితులు మార్క్సిజానికి మూడు మూలాధారాలు మూడు అవిభాజ్యభాగాలు పశ్చిమ యూరప్ దేశాల్లోని వర్గపోరాటాల నుంచే కమ్యూనిస్టు ప్రణాళిక ఆవిర్భవించింది వలస దేశాలు సామ్రాజ్యవాదులకి వ్యతిరేకంగా పోరాడుతున్నాయి. భూస్వామ్య వ్యవస్థ మీద బూర్జువా వర్గం పోరాడుతున్నది. బూర్జువావర్గం మీద కార్మికవర్గం పోరాడుతోంది. చరిత్ర పూర్వదశని అంతం చేసే కార్మికవర్గ పోరాటం పశ్చిమ దేశాల్లో జరుగుతోంది. చార్టిస్టు వుద్యమం, సైలీషియన్ కార్మికుల పోరాటం వంటివి పాలక వర్గాన్ని వణుకుపుట్టిస్తున్నాయి. పాత ప్రపంచానికి సంబంధించిన పాత భావాలకి వ్యతిరేకంగా అనేక కొత్తభావాలు పుడుతున్నాయి. తరతరాలుగా వస్తున్న సకల సామాజిక సంస్థల్నీ, భావవ్యవస్థల్నీ ప్రశ్నించడం ప్రారంభమైంది. దోపిడీ వర్గాలకి వ్యతిరేకంగా అనేకరహస్య సంఘాలు పని చేస్తున్నాయి. మార్క్స్, ఏంగెల్సులు భౌతికగతి తర్క ప్రాపంచిక దృక్పథంనుంచి కార్మికవర్గం విప్లవ వర్గమనీ, భౌతికశక్తిని భౌతికశక్తే కూలతోయగలదనీ ఆవిష్కరించిన తర్వాత ప్రపంచ కార్మికుల్ని అయిక్యం చెయ్యడానికి కృషి ప్రారంభించారు. సోషలిస్టుల పేరుతో, కమ్యూనిస్టుల పేరుతో ఉన్న అనేక మందిని కలిసి చర్చించారు. అనేక సంస్థల్తో సంబంధాలు పెట్టుకున్నారు. ఒక పక్క వర్గపోరాటాలు, మరొకపక్క సిద్ధాంత ఘర్షణలనుంచి ప్రణాళిక రూపుదిద్దుకుంది. అందుకనే ఇందులో ప్రతి వాక్యం సంఘర్షణ నుంచి ప్రసవించినట్టు స్పష్టంగా కనిపిస్తుంది.

Critique of Hegel Philosophy of Right లోనే మార్క్స్ చాలా స్పష్టంగా కార్మికవర్గ విప్లవకర పాత్రని విశ్లేషించాడు దేశదేశాల్లోని కార్మికుల్ని అయిక్యం చెయ్యడం కోసం కృషి ప్రారంభించాడు. అనేక ధోరణులు కలిగిన వాళ్ళు రహస్య బృందాలుగా పని చేస్తుండేవాళ్ళు. వీళ్ళల్లో చాలామంది లీగ్ ఆఫ్ ది జస్ట్ అనే సంస్థలో ఉండేవాళ్ళు. మార్క్స్, ఏంగెల్సు 1847లో లండన్ కాంగ్రెస్ ఆఫ్ ది లీగ్ ఆఫ్ ది జస్ట్ని పునర్నిర్మాణం చేసి కమ్యూనిస్టు లీగ్‌గా మార్చగలిగారు జర్మనీ, ఫ్రాన్స్, బ్రిటన్ వంటి దేశాల్లోని కార్మికవర్గ సంస్థల్ని ఈ వేదికలోకి తీసుకురావడానికి ప్రయత్నం చేశారు. లీగ్ ఆఫ్ జస్ట్‌కి 'మానవులందరూ సోదరులు' All Men Are Brothers అనేది లక్ష్యంగా ఉండేది. ఇదిపెటీ బూర్జువా

వినాదం. వర్గదృక్పథంలేని అధి భౌతిక శూన్యవాక్యం దీన్ని మార్క్స్ ఏంగెల్సులు "అన్ని దేశాల కార్మికులారా ఏకంకండి" Working Men of All Countries Unite, గా మార్చారు. ఈ చారిత్రిక లక్ష్యనిర్దేశం లోనే మార్క్స్ ఏంగెల్సుల కృషి ప్రతిబింబిస్తోంది. ఈ అంతర్జాతీయ సంస్థకి ఏంగెల్సు కమ్యూనిస్టు కన్ఫెషన్ "ఆఫ్ఫైత్" Communist Confession of Faith అనే ముసాయిదా రాసాడు. ఇది ప్రశ్నలూ సమాధానాల రూపంలోఉంది. ఈ ముసాయిదా 1847 జూన్ 2వ తేది నుంచి 9వ తేదివరకూ లండన్‌లో కమ్యూనిస్టులీగ్ మొదటి సమావేశంలో చర్చించిన కార్యక్రమ పత్రం. ఇలాంటి ముసాయిదాని ఏంగెల్సు రాసాడనీ దానిమీద చర్చ జరిగిందనీ 1971 వరకూ తెలియదు. ఇది మొదటిసారిగా ఇంగ్లీషులో Birth of the Communist Manifesto International Publishers 1971 లో ప్రచురించబడింది. దీని జర్మన్ ప్రతిని Hamuhrg లోని State and University Library లో బ్రెట్ ఆండ్రూస్ Bert Andruese అనే పరిశోధకుడు సంపాదించాడు. నిన్న మొన్నటిదాకా ఈ ముసాయిదాని London Central Authority of the Communist Legue సభ్యులు రూపొందించారని అనుకోవడం జరిగింది. ఈ ముసాయిదా మీద ట్రు సోషలిస్టులకి చెందిన హెస్ ‘Hess ’కీ ఏంగెల్సుకీ తీవ్రమైన చర్చలు జరిగాయి. ఆ చర్చల అనంతరం ఏంగెల్సు తిరిగి Principles of Communism అనే ముసాయిదా రాసాడు. ఇది కూడా ప్రశ్నలూ-సమాధానాల రూపంలోనేఉంది. అయితే మొదటి ముసాయిదా లోని మొదటి ఆరు ప్రశ్నలూ సమాధానాలూ ఊహా జనిత సోషలిస్టుల్ని సంతృప్తి పరచాలని రాసినవాటిని రెండవ ముసాయిదాలో తొలగించాడు. ఆనాటి లీగ్ ఆఫ్ ది జస్ట్‌తో సంబంధం ఉన్న బృందాల్లో ప్రశ్నలూ సమాధానాల రూపంలో రచనా పద్ధతి బాగా ప్రచారంలో ఉండడంవల్ల ఏంగెల్సు ఈ రూపంలో రాసాడు, ఇదికూడా లీగ్ సభ్యులకి సంతృప్తి కరంగా లేదు ఏంగెల్సుకీ సంతృప్తి కరంగాలేదు. 1847 నవంబరు - డిశంబర్‌ల్లో లీగ్ రెండో మహాసభ జరిగింది. దీనికి మార్క్స్ హాజరయ్యాడు. ముసాయిదా మీద చర్చలు జరిగాయి. ట్రూ సోషలిస్టు ఎమ్. హెస్ ప్రవేశపెట్టిన ముసాయిదా మీద ఏంగెల్సు విమర్శ పెట్టాడు. చివరికి ముసాయిదా రాసే బాధ్యతని లీగ్ నాయకులు మార్క్స్‌కి అప్ప చెప్పారు. స్కాపర్, బౌర్, మోల్ సంతకాల్తో కేంద్ర కమిటీ మార్క్స్‌కి ఇలారాసింది.

"కిందటి సారి జరిగిన మహాసభలో మార్క్స్ ఆమోదించినట్టు కమ్యూనిస్టు

పార్టీ ప్రణాళిక ముసాయిదాని రాసి ఫిబ్రవరి మొదటి తేది మంగళవారం కల్లా లండన్‌కి పంపించవలసిందిగా కేంద్ర కమిటీ బ్రెసెల్స్ జిల్లా కమిటీకి ఆదేశిస్తోంది అప్పటికి చేర్చకపోతే మార్క్స్ మీద తర్వాత చర్య తీసుకోబడుతుంది. మార్క్స్ ప్రణాళిక రాయకపోతే మహాసభలో ఆయనకి అందచేసిన పత్రాన్ని వెంటనే తిప్పి పంప వలసిందిగా కేంద్ర కమిటీ విజ్ఞప్తి చేస్తోంది. (కేంద్రీ కమిటి నిర్ణయాన్ని అనుసరించి కేంద్ర కమిటి తరపున ఇది రాయడం జరిగింది), దీని,బట్టి కేంద్రకమిటి కమ్యూనిస్టు పార్టీ ప్రణాళికని రూపొందించే బాధ్యతని మార్క్స్‌కి ఇచ్చిందనీ, ఈ ప్రణాళిక రాసేటప్పుడు ఏంగెల్సు రాసిన ముసాయిదా, హెస్ రాసిన ముసాయిదా, కేంద్ర కమిటి సభ్యుల అభిప్రాయాలూ, నమోదు అయిఉన్న మినిట్సు మార్క్స్ దగ్గర వున్నవని భావించవచ్చును. ఈ ప్రణాళికలోని ప్రధానమైన అంశంమార్క్సుదే అని ఏంగెల్సు అనేక సార్లు చెప్పాడు. ప్ర ణా ళి క రాస్తున్న సమయంలోనే ఏంగెల్సు మార్క్స్‌కి ఇలా వుత్తరంరాసాడు

"Confession Faith ని గురించి కొంచెం ఆలోచించు ప్రశ్నలూ-సమాధానాల రూపాన్ని పూర్తిగా వదిలివెయ్యడం మంచిదనుకుంటున్నాను. దాన్ని కమ్యూనిస్టు ప్రణాళిక అనిపిలిస్తే మంచిది. చరిత్రని కొంత చెప్పవలసిన అవసరంఉంది. కాబట్టి ఇంతకుముందటి రూపాన్ని అనుసరించడం అసలే కుదరదు. నేను రూపొందించిన ఒక ప్రతిని ఇక్కడ నుంచి తీసుకువస్తాను. అది సాధారణ కథన రూపంలో ఉంది. శబ్దప్రయోగం ఏమీ బాగుండలేదు, పరిగెత్తుతూ రాసినట్టుఉంది. కమ్యూనిజం అంటే? అనే ప్రశ్నతో ప్రారంభించాను తర్వాత కార్మికవర్గం, దానిచరిత్రా, పూర్వకాలంలోని శ్రామికులకీ కార్మిక వర్గానికీతేడా, బూర్జువా వర్గానికీ కార్మికవర్గానికి మధ్యవైరుధ్యం అభివృద్ధి కావడం, సంక్షోభాలూ నిర్ధారణలూ చేశాను. మధ్యలో అనేక అప్రధాన అంశాలుచెప్పి చివరికి బహిరంగంగా చెప్పదగిన మేరకి కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమాన్ని చెప్పాను. తిరిగిరాసి ఆమోదాన్ని పెట్టకపోయినప్పటికి ఏవో కొన్ని అల్పమైన అంశాల్లో తప్ప మన అభిప్రాయాలకి వ్యతిరేకమయినవి లేకుండా మాత్రం రాయగలిగాను, (ఏంగెల్స్, మార్క్స్ ఏంగెల్సు సమగ్రరచనలు 38వ సంపుటం పేజి: 149) ఈ ఉత్తరాన్నిబట్టి కమ్యూనిస్టు ప్రణాళిక రచనా విధానంలో అంటే రూపంలో ఏంగెల్సుకి అంతగా సంబంధం లేనప్పటికి అభిప్రాయాల్లో సంబంధం ఉందని చెప్పవచ్చును. ప్రణాళికను రాసేటప్పుడు మార్క్స్ ఏంగెల్సు రాసిన రెండు ముసాయిదాల్నీ, ఇతర డాక్యుమెంట్లనీ పరిశీలించాడనేది

స్పష్టం. ఏంగెల్సు చెప్పినట్లు ఆయనరాసినTwo Principles of Communismలో అభిప్రాయాలకీ ప్రణాళికలోని అభిప్రాయాలకీ పోలికలున్నాయి. కానీరచనలోకానీ, ప్రతిపాదనా పద్ధతిలోకానీ, విషయ విశ్లేషణలోకానీ ప్ర ణా ళి క తో పోల్చదగినది అంతకు పూర్వం కాని ఆ తర్వాతకానీ లేదు మానవాళిమీద ఈ ప్రణాళిక చేసినంత ప్రభావం మరేదీ చెయ్యలేదు. American Declaration of Independence (1776) French Declaration of Rights (1789)బబేవియన్ Manifesto of the Equals ఇవిఏవీ కమ్యూనిస్టు ప్రణాళిక చేసినంత ప్రభావంచెయ్యలేదు. చాలామంది మేధావులు కమ్యూనిస్టు ప్రణాళికని బబౌనిస్టు(Babounist)ప్రణాళికతో పోల్చి సాదృశ్యాలు చెప్పారు. కాని ఇవికేవలం ఆకారసాదృశ్యాలు మాత్రమే లక్ష్యం సంగతి అలావుంచి ఒక తార్కిక మొత్తంగా సమాజ భౌతికతర్కాన్ని భావనీకరించడంలోను సంగతి విషయంలో కూడా ఈ పోలిక ఎంత మాత్రం నిలవదు. కమ్యూనిస్టు ప్రణాళిక తర్వాత అనేకరంగాలకి సంబంధించిన అనే క మా ని ఫె స్టో లు వచ్చాయి ఎల్.కెల్సో.యం. యాడ్లర్ అనే వాళ్ళురాసిన The Capitalist Manifesto వంటి ఎంతో నిర్జీవ నీరసరచనలు జీవితాన్ని నింపుకున్న వాక్యం ఒక్కటి కూడా కనపడదు. సంగ్రహిత అంటేఎలా వుంటుందో కమ్యూనిస్టు ప్రణాళిక మంచి నేర్చుకోవలసింది ఎంతో విపులమైన విషయాన్ని, ఎన్నోపార్శ్వాలు గల విషయాన్ని ఒకమాటలో, ఒక వాక్యంలో చెప్పగలగడం ప్రపంచ సాహిత్యంలో ఒక్క ప్రణాళికలోనే చూడగలం మహాకవుల కవిత్వంలో కంటే ఉచిత, వ్యంగ్యార్థ స్ఫోరకతని మార్క్సు సాధించాడు ఇది భావనల కవిత్వమేకాదు పాటలకి పాట

కమ్యూనిస్టు ప్రణాళికలో 1. బూర్జువాలూ— కార్మికులూ 2 కార్మికులూ— కమ్యూనిస్టులూ 3 సోషలిస్టు— కమ్యూనిస్టు సాహిత్యం 4 ఈనాటి వివిధ ప్రతిపక్ష పార్టీలమీద కమ్యూనిస్టుల వైఖరి, అని నాలుగు భాగాలు కాదు నాలుగు అవయవాలు ఉన్నాయి. ఈ నాలుగు భాగాలకి 'అంతర గతితర్కం ఉంది.' కమ్యూనిస్టు ప్రణాళిక తనని తాను పరిచయం చేసుకోవడంతో ప్రారంభం అవుతుంది. యూరప్‌ఖండంలోని మతగురువులూ, మహారాజులూ, మహాసంపన్నులూ గజగజవణికి పోతున్నారు. ఎందుకు? ఖండం అంతటావ్యాపించిన కమ్యూనిస్టు భూతం గురించి, అందుకని కమ్యూనిస్టులు తమ ఆశయాల్ని స్పష్టంగా ప్రజలకి చాటిచెప్పవలసిన సమయం పరిపక్వం అయింది. అందుకే కమ్యూనిస్టు ప్రణాళికంని చరిత్ర ప్రసవించింది. పూర్వనాటకాల్లో నాందిఅనిఉండేది. దీన్నే ప్రొలోగ్ అంటారు. ఈభాగంఅలాంటిది.

అయితే ఏ సంస్కృతనాటకాల్లోని నాంది, ఏగ్రీకునాటకాల్లోని ప్రొలోగ్ ప్రణాళిక ప్రొలోగ్ ముందు నిలువగలదు? ఈ ప్రొలోగ్ ప్రణాళిక విత్తనం ఫలంవిత్తనాలు-కూడా, ఇదిప్రణాళిక సిద్ధాంత కార్యక్రమాల సూక్ష్మరూపం. వర్తమాన ప్రపంచంతో కూలిపోయే ప్రపంచం మీదదాడితో ఇది ప్రారంభం అవుతుంది. "కమ్యూనిస్టులు తమ అభిప్రాయాలనూ, తమలక్ష్యాలనూ, తమధోరణులనూ, బాహాటంగా, యావత్ప్రపంచం ఎదుటా ప్రకటించి, కమ్యూనిస్టుభూతమనే ఈకట్టుకథను తమపార్టీ ప్రణాళికతోనే యెదుర్కోవలసిన సమయం ఆసన్నమైంది." ఇదీ ప్రణాళికారచనకి భౌతిక గతి తర్క కారణం. కమ్యూనిస్టు లీగ్ కేంద్రకమిటీ రాయమనడం, ముసాయిదాలు రాయడం, చర్చలూ- ఇవన్నీ పైకి స్థూలదృష్టికి కనిపించేకారణాలు. ఈకారణాల రూపంలో భౌతికవాస్తవికత పురోగామి దృక్పథంగల మేధావుల మనస్సుల్లోకి అనువదింపబడింది. చరిత్రలో ఒక సమయం ఆసన్నమైనప్పుడు దాన్ని తక్షణం ఎదుర్కోవడం కమ్యూనిస్టులకర్తవ్యం. లేకపోతే చరిత్ర గమనానికి అగ్రగామిదళంగా పనిచేయలేరు. ఈ ఎదుర్కొనే లక్ష్యాన్ని నెరవేర్చడానికి ప్రణాళికారచన చేయబడింది. ఈ లక్ష్యమే ప్రణాళికలోని ప్రతి వాక్యానికీ ఉత్తేజం.

ప్రణాళికలో మొదటి భాగం బూర్జువాలూ-కార్మికులూ అనే దాంట్లో మార్క్స్ సమాజ వర్గ స్వభావమూ, వర్గాల పూర్వచరిత్ర సూచించి ఆధునిక బూర్జువా వర్గం పుట్టుకనీ, అభివృద్ధినీ గత తార్కికంగా ప్రతిపాదించి బూర్జువా వర్గంతోబాటు అవి భాజ్యంగా ఆవిర్భవించే కార్మిక వర్గాన్ని గురించి వివరించి "బూర్జువావర్గ పతనమూ అనివార్యమే కార్మిక వర్గ విజయమూ అనివార్యమే" అని నిరూపించాడు. "ఇంత వరకూ నడిచిన సమాజపు చరిత్ర అంతా వర్గపోరాటాల చరిత్రే." ఇది మొత్తం మానవజాతి చరిత్రని గత తార్కిక ఆ యుధంతో సాధించిన విజయం. ఈ వాక్యం మానిఫెస్టోలో కీలకమైన అంశం. ఇక్కడచరిత్ర అంటే ఉపరితల అంశమైన లిఖిత చరిత్ర కాదు. మానవఅస్తిత్వాన్ని సామాజిక అభివృద్ధికి సంబంధించిన క్రమంగా అవగాహన చేసుకోవడం చరిత్ర అదిమ కమ్యూనిస్టు సమాజంలో వర్గపోరాటం ప్రకృతికే సమాజానికి వైరుధ్యరూపంలో ఉంటుంది. ప్రకృతి నుంచీ ఉత్పత్తి సాధనాల్ని ఉత్పత్తిచేసే క్రమంలోనూ, సమిష్టి సమాజ నిర్మాణ శ్రమ విభజనలోనూ క్రమంగా ఆదిమ కమ్యూనిస్టు సమాజం విచ్ఛిన్నమై పోయింది. ఆదిమ కమ్యూనిస్టు సమాజాన్ని చరిత్ర కాదనడం తక్కిన చరిత్ర నుంచి విడదీయడం శాస్త్రవిరుద్ధం, సామాజిక-ఆర్థిక నిర్మాణాలన్నీ అన్యోన్య సంబంధంగల, అనేక కారణ అనేక కార్య

కారణ కార్యాలు చరిత్రే. ఈ చరిత్ర ప్రకృతీ సమాజం వాటికి సంబంధించిన చైతన్యాల అవయవిగానే ఉంటుంది. ఏప్ (Ape)ని సంపూర్ణంగా అధ్యయనం చేసినా మనిషిని అధ్యయనం చేసినట్టుకాదు. మనిషిని సంపూర్ణంగా అధ్యయనం చేస్తే ఏప్‌ని కూడా అధ్యయనం చేసినట్టే. ఈకారణంతోనే మార్క్స్ సమాజ ప్రధాన స్వరూపాన్ని సామాజిక- ఆర్థిక నిర్మాణపరంగా నిర్వచించి పూర్వవ్యవస్థల్ని ప్రస్తావనా పూర్వకంగా నిరూపించి బూర్జువా వ్యవస్థనిగూర్చి విపులంగా చర్చించాడు. ఆర్థికంగా, రాజకీయంగా భావజాలపరంగా బూర్జువా వ్యవస్థ చరిత్రని పరిమాణ- గుణాలూ- వైరుధ్యాలూ, అభావం అభావంకావడాలూ అనే మూడు మౌలిక సూత్రాల్ని ఒక మొత్తంగా గ్రహించి చిత్రించాడు. మధ్యయుగాల్లో స్వతంత్రపౌరులుగా ప్రారంభమై వృత్తిసంఘాలనుంచి కార్ఖానా పరిశ్రమలకీ, పారిశ్రామిక మధ్యతరగతినుంచి పారిశ్రామిక అధిపతులుగా అంటే, ఆధునిక బూర్జువాలుగా అవతరించారు. ఈక్రమంతోబాటు అమెరికా ఖండాన్ని ఆవిష్కరించడం, సముద్రమార్గాల్ని కనిపెట్టడం, మార్కెట్లు ఏర్పడడం, వలసదేశాల్లో వర్తకం సరుకుల ఉత్పత్తి పెరగడంతో, వాణిజ్యానికీ, సముద్రయానానికీ పరిశ్రమలకీ మంచి ఊపువచ్చింది. ఆవిరిఇంజన్లూ, యంత్రాలూ అభివృద్ధిపొందడంతో పరిశ్రమలు ఇంకా అభివృద్ధి అయ్యాయి.

"ఈ విధంగా పరిశ్రమలూ, వాణిజ్యమూ, సముద్రయానమూ రైల్వేలూ విస్తరించేకొద్దీ, అదేనిష్పత్తిలో బూర్జువా వర్గమూ అభివృద్ధి అయింది. దానిపెట్టుబడి పెరిగింది. మధ్యయుగాల నుండి వచ్చిన ప్రతివర్గమూ వెనక్కి నెట్టివేయబడింది. "కాబట్టి ఆధునిక బూర్జువా వర్గమనేదే దీర్ఘకాలిక ఫలితంగా యేర్పడిందనీ, ఉత్పత్తి విధానాల్లోనూ మారకపు విధానాల్లోనూ జరిగిన అనేక విప్లవాల పర్యవసానమనీ మనకి అర్థమవుతున్నది." బూర్జువా వర్గానికి ఆర్థికవ్యవస్థ మీద అధికారంరాగానే "తదనుగుణంగా అది అడుగడుగునా రాజకీయంగా కూడా పురోగమించింది". అంటే బూర్జువా వర్గానికి ఆర్థికవ్యవస్థ మీద యాజమాన్యం రాగానే రాజకీయాధికారంకూడా సంక్రమించింది. కాబట్టి ఆధునిక రాజ్యంలో ప్రభుత్వం అనేది మొత్తం బూర్జువా వర్గపు సమిష్టి వ్యవహారాలు చక్కబెట్టే కమిటీ మాత్రమే." ఇలా బూర్జువావర్గం ఆర్థిక, రాజకీయాధిపత్యాని సంపాదించుకొని విప్లవకర పాత్రని నిర్వహించింది. సమాజం అంటే ఆర్థిక రాజకీయమేకాదు. మత, నైతిక కళాసాహిత్య న్యాయశాస్త్రం వంటి ఉపరితల అంశాలు చాలాముఖ్యమైనవి. జాతివుత్పత్తి, జాతి అవసరాల వుత్పత్తి భౌతిక జీవితం ఇదిమానవుల చైతన్యంలోకి వచ్చి ఉపరితల అంశాలుగా వ్యవస్థీ

కరించ బడుతుంది. ఇలాజరగకపోతే భౌతిక జీవితాన్ని చైతన్యవంతంగా సమిష్టి కార్యాచరణలో మార్చగలగడం అసంభవం. బూర్జువా వర్గం మొత్తంగా ఫ్యూడల్ సామాజిక సంబంధాలన్నిటినీ మార్చివేసింది. అని మానవ సంబంధాల్ని కుటుంబ సంబంధాల్తో సహా అన్నిటినీ ఆర్థిక సంబంధాలుగా మార్చివేసింది. పూర్వసామాజిక రూపాల్లో ఉండిన అన్ని ముసుగుల్నీ చించిపారవేసింది. జీవితంలో మార్పుల్ని వేగ వంతం చేసింది. "భౌతిక వస్తువుల ఉత్పత్తిలోఉన్న పరిస్థితే బౌద్ధిక వుత్పత్తికికూడా వర్తిస్తుంది" కాబట్టి బూర్జువాలు ఏదోఒకదాన్ని పునాదినో ఉపరితల అంశాల్నో, ఉపరితల అంశాల్లో ఏ ఒకదాన్నో మార్చడంకాక మొత్తం వ్యవస్థని మార్చివేశారు. "ఒక్క మాటలో చెప్పాలంటే బూర్జువావర్గం తన్నుపోలిన ప్రపంచాన్ని సృష్టిస్తుంది" అందుకనే వర్గం అన్నా బూర్జువావర్గం అన్నా కేవలం ఆర్థిక వర్గాలుకావు, ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక అవయవాల్తోకూడిన వర్గాలు, బూర్జువా ఉత్పత్తి విధానాన్ని అంటే ఆర్థిక పునాదిని ఉపరితల అంశంనుంచీ విభజించ డానికి వీల్లేదు. అవయవి అవయవ సంబంధంలేక పోతే, సంబంధాన్ని అలా Organicగాభావించక పోతే మానిఫెస్టో అవగాహన కాదు. ఆదిసమాజంలో అయినా అంతే. వర్గ సమాజంలో అయినా అంతే. వర్గరహిత సమాజంలో అయినా అంతే.

బూర్జువా వ్యవస్థ వర్గవైరుధ్యాల్ని సరళం చేస్తుంది. ఫ్యూడల్ వ్యవస్థలోని అసంఖ్యాక వర్గాల్నీ, శ్రేణుల్నీ నిర్మూలించి బూర్జువావర్గం ఒకపక్క కార్మిక వర్గం మరొకపక్క శత్రుశిబిరాలుగా నిలుస్తాయి. అంటే బూర్జువా సాంఘిక-ఆర్థిక నిర్మాణంలో కార్మికవర్గం లేకుండా బూర్జువావర్గం. బూర్జువావర్గం లేకుండా కార్మికవర్గం సాధ్యంకాదు. ఈరెండు వర్గాలకీ వైరుధ్యమే బూర్జువావ్యవస్థ ప్రధాన వైరుధ్యం, వైరుధ్యం అంటే విరుద్ధశక్తుల మధ్య అయిక్యత, సంఘర్షణల కలయిక. కార్మిక బూర్జువా వర్గాలు కలిసి ఒక వ్యవస్థగా ఉండటమే అయిక్యత. రెండు వర్గాలకీ నిరంతర పోరాటమే సంఘర్షణ. ఈ వైరుధ్యాన్ని మార్క్స్ అగాధమైన భౌతికగతి తర్కంతో ప్రతి పాదించాడు. బూర్జువావర్గ అభివృద్ధితో కలిసే కార్మికవర్గం అభివృద్ధి పొందింది. కార్మికవర్గ అభివృద్ధితో కలిసే బూర్జువావర్గం అభివృద్ధి పొందింది. అవయవిలో ఒక అవయవం మాత్రమే పెరుగుతూ మిగిలిన అవయవాల పెరుగుదల ఆగిపోనట్టు బూర్జువావర్గం కార్మికవర్గం పెరగకుండా అభివృద్ధి పొందలేదు. ఫ్యూడల్ వ్యవస్థకి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో కార్మికవర్గం బూర్జువావర్గాన్ని సమర్థిస్తుంది. బూర్జువాలు అధికారంలోకి రాగానే బూర్జువా, కార్మికవర్గపోరాటం ఉధృతంఅవుతుంది.

"బూర్జువావర్గం ఏ ఆయుధాలతో ఫ్యూడలిజాన్ని నేలకూల్చిందో ఆ ఆయుధాలు ఇప్పుడు బూర్జువా వర్గంమీదకి ఎత్తబడినాయి" "కానీ బూర్జువావర్గం సృష్టించింది తననే నాశనం చేయగల ఆయుధాలను మాత్రమేకాదు. ఆ ఆయుధాలను ధరించే మనుషులను కూడా అది సృష్టించింది. ఆ మనుషులే కార్మికవర్గం" బూర్జువావర్గం తననే అభావం చేసే కార్మికవర్గాన్ని సృష్టించుకుంది. తమ అస్తిత్వం కోసం బూర్జువాలు కార్మికుల్ని అనివార్యంగా సృష్టిస్తారు. వాస్తవానికి అస్తిత్వంలోకి వచ్చిన ప్రతి వస్తువూ తనని అభావం చేసేఅంశంతోనే అస్తిత్వంలోకి వస్తుంది. బూర్జువావర్గం అంటే పెట్టుబడి ఏ నిష్పత్తిలో అభివృద్ధి పొందుతుందో కార్మికవర్గం ఆనిష్పత్తిలోనే అభివృద్ధి పొందుతుంది. బూర్జువా వర్గమూ, కార్మికవర్గమూ కూడా ఆధునికవర్గాలే. యంత్రాలు ఉత్పత్తిలోకి రాగానే కార్మికవర్గం గుంపులు గుంపులుగా పరిశ్రమల్లోకి అడుగుపెడతారు. బూర్జువావర్గ దోపిడీ విధానంవల్లా, ఉత్పత్తిశక్తుల నిరంతరవిప్లవీకరణంవల్లా శ్రమశక్తిని మాత్రమే అమ్ముకొని జీవించే కార్మికవర్గం పరిస్థితి హృదయవిదారకంగా మారిపోతుంది. శ్రమశక్తి సరుకుగామారి శ్రామికుడు పరాయీకరణం పొందుతాడు. మధ్యవర్గాలు అనేకం బూర్జువావర్గంతో పోటీకి నిలవలేక కార్మికవర్గంలోకి చేరిపోతుంటారు. కార్మికుడు అనేక ముఖ దోపిడీకి గురిఅవుతాడు. బూర్జువావర్గంలో ఉన్నట్టే "కార్మికవర్గం అభివృద్ధిలో వివిధ దశలున్నాయి. పుట్టుకతోనే ప్రారంభం అవుతుంది బూర్జువావర్గంతో దాని పోరాటం" ఇలా కార్మికవర్గం పోరాటంనుంచీ పుట్టి బూర్జువావర్గ రాజ్యాధికారంకోసం జరిగిన పోరాటంలో అనుభవాన్ని గడించి క్రమంగా శ్రామికవర్గ రాజ్యాధికారంకోసం పోరాటానికి సంసిద్ధం అవుతుంది. తొలిదశలో ఈ పోరాటాలవల్ల కార్మికవర్గం ఐక్యం కావడం ప్రారంభం అవుతుంది. బూర్జువావర్గ ఐక్యతే కార్మికవర్గ ఐక్యతకి దారి తీస్తుంది. "ప్రతి వర్గపోరాటమూ ఒక రాజకీయ పోరాటమే" బూర్జువావర్గ రాజకీయ ప్రయోజనాల కోసమే అది కార్మికవర్గాన్ని రాజకీయ రంగంలోకి లాగుతుంది. ఇలా బూర్జువా వర్గంతో యుద్ధం చెయ్యడానికి ఆయుధాల్ని కార్మిక వర్గానికి బూర్జువావర్గమే అందిస్తుంది. వర్గపోరాటం ఉధృతం అయ్యేకొద్దీ కార్మికవర్గం బూర్జువావర్గంమీద విజయాలు సాధిస్తుంటే పాలక వర్గంలో విచ్ఛిత్తి ప్రక్రియ ప్రారంభం అవుతుంది. అంటే పాలక వర్గంనుంచీ అనేకమంది విప్లవ వర్గమైన కార్మికవర్గం వైపుకి పురోగమిస్తారు. ముఖ్యంగా "మొత్తం చరిత్రగతి నంతటినీ సిద్ధాంతరీత్యా అవగాహన చేసుకోగల స్థాయికి చేరుకున్న బూర్జువా సిద్ధాంతవేత్తల్లో ఒక భాగం" కార్మికవర్గంతో కలుస్తుంది. ఇది చారిత్రిక క్రమంలో పరిమాణం గుణంకావడం గుణం పరిమాణం

## ఆకలి మంటలు

గోపి

ఆకాశంలో కంటూ పెరిగిన చెట్లకిందినుండి జీప్ నిదానంగాపోతోంది. ఆపక్క-ఈపక్క వెదురుపొదలు ఆకులురాల్చిమోడుల్లాగా ఉన్నాయి. అక్కడక్కడ ఉన్నతునికి చెట్లుమాత్రం ఎర్రటిఆకులతో ఇప్పుడిప్పుడే చిగురుస్తున్నాయి. ఆకాశం జేగురురంగునుంచి నీలంలోకి, నీలంనుండి నల్లరంగులోకి మారుతోంది. జీప్ ఇంజనుశబ్దం తప్ప ఏ అలికిడిలేదు.

జీప్‌లో సర్కిల్ ఆఫీసరు (కాగితపుమిల్లు ఏరియా ఆఫీసర్) నారాయణరావు గుండెవేగంగా కొట్టుకోగా దిగాలుపడికూర్చున్నాడు, ఆలోచనలతో తలపోటుగాఉంది. గంటకుపైన్నే ప్రయాణంచేయబట్టి, జీప్‌కుదుపులకు ఒళ్లంతా నెప్పిగాఉంది. జీర గొంతుతో తనకుమాత్రం సగంతెలిసి, సగంతెలియనట్టి రాజస్థానీ హిందీలో మేనేజరు అన్నమాటలు ఎంతవద్దనుకున్నా పదేపదే గుర్తుకు వస్తున్నాయి, ఆమాటలనుంచి నారాయణరావు గ్రహించింది. "చీకటోళ్లో-ఆకటోల్లో-నాకనవసరం-మనకుప్రొడక్షన్ కావాలి. వెదురు అరణ్యాలల్లోకాకుండా స్వంతకమతాల్లో ఉంటుందా? ఆదేమన్న

---

కావడం అనే సూత్రం పని చేయడంలో చాలా ముఖ్యమైన అంశం. ఇలా విచ్ఛిత్తి ప్రక్రియ ద్వారా వచ్చిన మేధావులు కార్మికవర్గ విప్లవంలో అగ్రగామిపాత్రనీ, ప్రధాన ప్రచార ప్రభావపాత్రనీ నిర్వహిస్తారు. క్రమంగా అనేక సంక్షోభాల పరంపరలతోనూ, కార్మిక వర్గసమిష్టి పోరాటాల వల్లా బూర్జువావర్గం పతనం అవుతూ కార్మిక వర్గాన్ని శ్రమశక్తిని అమ్ముకొని బతికేస్థితిని కూడా లేకుండా చేస్తుంది. బూర్జువావర్గం పాలకవర్గంగా అర్హతని కోల్పోతుంది. బూర్జువావర్గం ఉత్పత్తి చేసే వాటిల్లోకల్లా ముఖ్యమైనదేమంటే తనకే మారకులైనవాళ్ళు. కాబట్టి బూర్జువా వర్గపతనమూ కార్మికవర్గ విజయమూ అనివార్యం, ఈ విధంగా 'బూర్జువాలూ-కార్మికులూ' అనే ప్రణాళిక మొదటి భాగంలో మొత్తం వర్గసమాజచరిత్ర, బూర్జువా కార్మికవర్గాల ఆవిర్భావం, వాటి మధ్య వైరుధ్యం తీవ్రతరం కావడం, అంతిమంగా బూర్జువావర్గం పరాజయాన్ని పొందడాన్ని, కార్మికవర్గం విజయాన్ని పొందడాన్ని మార్క్సు, ఏంగెల్సులు అవయవ-అవయవి దృక్పథంతో, భౌతికగతితర్క వస్తుగత సూత్రాల్తో నిరూపించారు. పునాదినీ ఉపరితల అంశాల్నీ ఒక అవయవిగా (organism) ఒక మహత్తర చారిత్రిక సందర్భాన్ని లవలేశం కూడా విస్మరించకుండా ప్రపంచ ప్రజల ముందు నిలిపారు

(ముగింపు వచ్చే సంచికలో)

చెరుకుగడలా? సో.... అడివినుంచి వెదురు మన కంపెనీకి రావాల్సిందే. ఎట్లాగో అట్లాగా తెచ్చేందుకే. ఆభాగ్యానికే, నీకుజీప్‌డ్రైవరునిచ్చింది. అసమర్థులుగా మనల్ని కంపెనీ తలచిందంటే సమర్థుణ్ని పెట్టుకుంటుంది. అర్థమైనట్టేనా?" "తత్తరపడుతూ "సార్ వాళ్లు సమ్మెచేస్తున్నారు, కూలిరేటు...." నారాయణరావు నసిగాడు. "కూలీలు సమ్మెలు చెయ్యకుండా. ఏగందరగోళంలేకుండా వెదురు కంపెనీకి వొచ్చిపడితే, నీ,నా అవసరమే ముంటుంది.? కనుక నిరుడే మనంకూలిరేటుపెంచాం. ఈసారిపెంచదలుచ లేదు. ఎట్లాటాకిల్ చేస్తావోనీయిష్టం. ఇఫ్‌యూ వాంట్ వికెన్ టేక్ ది హెల్ప్ ఆఫ్ పోలీస్" (నీకుకావాలంటే మనం పోలీసుల సహాయం తీసుకోవచ్చు.)

నారాయణరావుకు పోలీసులతో పని జరుగదనితెలుసు, బహుశా మేనేజరుకు తెలిసుండాలా.... పింగ్ ఏరియా ఆఫీసర్ అనుభవం ఉండనే ఉన్నది. ఇంట్లోకొచ్చి చిత్తు చిత్తుగా తన్నిపోయారు. ఏపోలీసు అడ్డంరాలేదు. పైగా కొండలల్లో దళాలు తిరుగుతున్నట్లు రోజుకో వార్త వస్తోంది.

ఎదురుగా లారీరావడంతో డ్రైవరు జీప్‌కుబ్రేక్‌వేశాడు తన ఆలోచనలకు బ్రేక్ పడింది.

"నమస్తేసార్" లారీడ్రైవరు క్లీనరు ఒక్కసారిగాఅన్నారు,

"ఆఁఏవిఁటోయ్ కూపీకాడ కూలోళ్లున్నట్టేనా?"

"ఆళ్ల దెయ్యాలనాగ ఆన్నుంచి కదల్టంనేదండి బాబో! మీరొత్తారని సూత్తన్నారుబాబో- బావోఁ ఏంజెప్పనండీ! ఆళ్లమునుపటిఎర్రి ఎధవలుకాదండి. లిటిగేసన్లు తీత్తన్నారండీ.! లెక్కలుకడ్తన్నారండీ!" డ్రైవరు తలగోక్కుంటూ ఇంకా చాలా చెప్పాలనుకున్నాడు, ఎందుచేతో సమయానికి గుర్తురావడంలేదు.

మాగిన చింతపండులాగున్నక్లీనరు- "కానండీ- ఆళ్ళకుసీకటోల్లు సానా ధైర్యం చెప్పినట్టున్నదండీ.... సిక్కోలుఇద్దెంకాన్నుంచి కంపినీ కూలోడుదాకా పాటలు పాడ్తన్నారండి." అందించాడు ఆపాటలుబాగానే ఉన్నట్టు క్లీనరునల్లటిముఖంలో పిసరంత వెలుగు కన్పిస్తోంది.

"లారీనిమెనక్కితిప్పు" నారాయణరావు అన్నాడు.

"లోడింగ్ నేదుకదండీ! అటో యిటో తేలేదాకా లారీలొత్తే అంటించేత్తామని మీ కంపెనీ మేనేజరుకు చెప్పమన్నారండీ- సూడవోతే అన్నంతపనిసేసేవోళ్లనాగే ఉన్నారండీ-"

"నీకే చెప్పేది!" నారాయణరావు కోపంగాఅన్నాడు.

"అయ్‌బాబోయ్- ఆఫీసర్‌గారు యమకోపంగా ఉన్నారు." క్లీనర్, అన్నాడు. డ్రైవరు గొణుగుతూ లారీతిప్పాడు.

చుక్కలు మినుకు మినుకుమంటున్నాయి. పక్షిఏదో అడవిలో ఎక్కడో కూస్తోంది. జీప్‌లైట్లువేశాడు డ్రైవరు.

సమ్మె మొదలుపెట్టి పదిరోజులయ్యింది. మూడు డివిజన్లలో సమ్మె ఉధృతంగా ఉన్నది. అంటే ఈపదిరోజులనుండి మూడు డివిజన్లనుంచి ఒక్కలారీ అన్నా వెదురు కంపెనీకిపోలేదు. ఖాళీలారీలుతప్ప లోడన్నమాటలేదు. రోజులారీలు పంపుతూనేఉన్నారు. ఇదికొత్త అనుభవంకాదు. గత రెండుమూడు సంవత్సరాలనుండి ఇట్లా జర్గుతూనే ఉన్నది. 'లెవీ' డివిజనుకు ఇంతని తెలిసేది- మళ్ళీ మామూలుగా పని నడిచేది-వీళ్ళువాళ్ళలాగాలేరు. లెవీసంగతి లేనేలేదు. వార్తలను బట్టి ఇది ఇంకో పార్టీ అని తెలుస్తోంది.... పోనీ క్యాంపులు పెట్టిద్దామంటే- వెదురుపనే నడిచేటట్లులేదు. జనం వాళ్లమాటేవింటున్నారు.

"కూపీ దగ్గరకొచ్చాంసార్!" నారాయణరావు ఉలిక్కిపడ్డాడు. ముందు లారీ ఆగిఉన్నది. అప్పుడే డ్రైవరు, క్లీనరు దిగిపోయారు. హెడ్‌లైట్ల వెలుతురులో ఎక్కడికక్కడ వెదురుకుప్పలు పడున్నాయి. లారీల అచ్చులున్నాయి. కుడివేపు కొంచెందూరంలో నెగడు మండుతోంది. వెదురు చిటపటలాడటం అక్కడికి విన్పిస్తూనే ఉన్నది. లారీని జీప్‌ను చూసికూడ కూలీలురాలేదు. ఇదే ఇంకోసారైతే ఈగలలాగా చుట్టూ మూగిపోయి ఎన్నో కోరికలు విన్నవించుకునేవారు.

నారాయణరావు బ్యాటరీలైటు తీసుకొని డ్రైవర్లిద్దరు, క్లీనరువెంటరాగా నెగడు దగ్గరికివెళ్లాడు. ఒకయువకుడు వెదురుకుప్పలమధ్యనుంచి లారీ, జీప్‌ల దగ్గరికొచ్చి పోలీసులను వెంటతెచ్చారేమోనని చూసివచ్చాడు, అటునుంచటే కొండపై భాగంకేసి పరుగెత్తాడు.

"ఇన్నాళ్లకు మేం సచ్చావో, బతికావో సూసిపోదావని ఒచ్చావా బాబో." నల్లగా వెదురు పుల్లలకు చర్మంఅతికినట్లుగా చీదర చీదరగా, ఆకలి ఆకలిగా ఉన్న ఒక ముసలివాడన్నాడు.

"మనం సప్తేకూలోలు కరువా?" అన్నాడింకో యువకుడు."

నారాయణరావు ఏమనకుండా పక్కనే ఉన్న వెదురుతుప్పకొరిగి నిల్చున్నాడు. అందరిముఖాలు మంటవెలుతురులో ఎర్రెర్రగా మండుతున్నట్లుగానే ఉన్నాయి.

గిరిజనులు గొణిగారు. ఎటూకాకుండాతిట్టారు. కొంచెంసేపట్లో. "అన్నలొచ్చేసినారు" అన్నాడెవడో. ఒక్కసారిగా కలకలం మంట దగ్గర ఉన్నవాళ్ల ఇరవై మందేకానీ చెట్లకింద డొక్కలకుకాళ్లముడుచుకొని పడుకున్నవాళ్లలేచొచ్చారు. అంతా అరవై పైన్నే ఉంటారు.

"గిరిజన రైతుకూలీ సంఘం వర్థిల్లాల"

"వెదురుకూలీల సమ్మె వర్థిల్లాల"

"కంపినోల మొండితనం నశించాల" అనినాదాలు అన్నలేయిచ్చారో, కూలీలేయిచ్చారో తెలియనంతగా అందరు ఏక కంఠంతో అరిచారు.

నారాయణరావుకు అట్లావొచ్చే అయిదుగురు యువకులను, వాళ్ళ చేతుల్లోని తుపాకులను. ఒకస్త్రీని- ఆమెచేతిలోని తుపాకిని చూసేసరికి సన్నగా వొణుకు ప్రారంభమయ్యింది- అనినాదాలు వింటుంటే ముచ్చెమటలు పోశాయి.

వచ్చిన వాళ్ల పాదాలు దుమ్ముకొట్టుక పోయిఉన్నా - ముఖాలమీద అలసట కన్పిస్తున్నా శాంతంగానే ఉన్నట్లనిపించింది ఒకడెవడో సందెడు వెదురు నరికి నెగడిలో వేశాడు - మంట గుప్పున లేచింది. వాళ్లవెనుక కూలీలు నిల్చున్నారు.

"మా 'డిమాండ్సు'కు మీరు ఒప్పుకున్నట్టేనా?" దళకమాండర్ అన్నాడు.

"ఆలెక్కడ ఒప్పుకుంతలు బురదల బుగ్గిలమనం నిలుసున్నం. అలుఒడ్డు మీనున్నరు" ఒకతొర్రివాడు అన్నాడు.

"కాదురొరే! ఆలు సిమ్మెంటు బంగుళాల ఉంతరు. మనం అడివిన-సీలనక-ఎండనక-వెదురు నరుకుతన్నం." ఇంకొకడు అందించాడు.

"మీరట్లామాట్లాడితె ఏంజెప్పవండీ-ఒప్పుకున్నారంటేన్యాయంగా పోవాల-విరుడు పెంచాంకదండీ — ఇట్లాప్రితి సంవత్సరం పెంచుతూపోతుంటే దానికి అంతెక్కడండీ — మీరుఆలోసించాల — మాకంపినీ ఉన్నంత కాలం కూలీలుంటారు కదండీ—కూలీలున్నంత కాలం మీరుంటారు కదండీ—కనుక మనం విడిగా కూర్చుండి

సెటిల్ చేసుకుంటే మంచిదేమో' నారాయణరావు ఎండి పోతున్న గొంతును ఉగ్గబట్టుకొని— మేము 'లెవీ' యిస్తామని అర్థం వచ్చేలాగా అన్నాడు.

దళకమాండర్ ముఖం మారిపోయింది. "ఆదొంగవ్యవహారాలు బాబు మాటలు వొద్దు ఏదైనా కూలీలముందే జరగాలి. పోయిన సంవత్సరం 4 రూ. లకు 8 డిమాండుచేస్తే 5 రూ.లకు పెంచారు. ధరలుఎట్లా పెరిగాయి? మీకాగినానికే పోయిన సంవత్సరమున్న రేటు ఈ సంవత్సరంఉన్నదా!"

"మరింక మీయిష్టమండీ-మా మేనేజు మెంటుమాట చెప్పాను " నారాయణరావు గొంతులో ఇంకోమాట ఆట్లాగేఉండిపోయింది.

"ఇదిగిట నువ్వు చెప్పొచ్చినావాబావో, ఈన బెల్లంలోకత్తి, మనం కడుపు కాలున్నాం ఆలు బాగాతిని బొజ్జలుపెంచున్నారు. మరంద్బేత ఆలకు పెగఠాకాల. అప్పుడుగాని దారికిరారు." ఒక యువకుడు అన్నాడు.

"బెల్లంలకత్తా! ఈన ఇరవైదినాలక్రింద బావో, మాంచి ఎండపూటనొచ్చాడు ఊడకు-లోడింగు జరుగుతున్నాది. బాబయ్యా నాకు కళ్లకు సీకట్లు కమ్మినీనాయి. ఆదినం ఏవీఁతినక పనికొచ్చినాను. మోపెత్తుకొని జారిపడ్డానుబాబో-ఈ ఆపీసర్ బావు లగెత్తుకొచ్చి నాముడ్డిమీద తన్నేడుబాబో-" ఒక ముసలివాడు మందిలోనుండి బయట కొచ్చి చెప్పాడు.

నారాయణరావు ఆ సంఘటన ఎప్పుడో మర్చిపోయాడు. కూలీలను ఆపాటి ఆదిరించి బెదిరించడం కొత్తగాదు. దళపోళ్లముందు చెప్పాడు ముసలోడు—వాడి ముఖంలో ఏముందో చూడలేక నారాయణరావు తలవాల్చుకున్నాడు.

" గాలి పంతాల కింద పుట్టిపెరిగినోలకి ఏం తెలుసుద్ది మనం వెదురు పంపుతె ఈబాబు సూటుబూటులేసుకొని తిరు - తన్నాడు" అన్నాడెవడో!

" అయితే కష్టం సుఖం చెప్పాల్సిందే" అన్నది దళపోళ్ల స్త్రీ ఇద్దరు దళసభ్యులు ఒకవెదురు కట్టఎత్తి నారాయణరావు నెత్తిమీదపెట్టి నడవమన్నారు. అవమానంతో నారాయణరావు తలవాలిపోయింది. బరువు ఆపలేక కిందపడ్డాడు. ఒళ్లంతా దుమ్ముకొట్టుకపోయింది. కూలీల ముఖాల్లో చెప్పరానంత సంతోషం.

నారాయణరావును లేపినిలుచుండబెట్టారు. "మీయాజమానులతో కూలీలు చెప్పరానంతశ్రమ పడుతున్నారనిచెప్పు-అడవిలో ఎండలో, వానలో, చలిలోఎండి,నాని చీకిపోతూ మీయజమాని కోట్లలాభానికి కారణమౌతున్నారని చెప్పు." దళకమాండర్ అట్లా మాట్లాడుతుండగానే జీప్, లారీ తగలబడుతూ పెద్దమంటలులేచాయి.

దళనాయకుడు "చెప్పు-వీళ్ళు ఆకలితో, దరిద్రింతో ఇన్నిరోజులు అలమటించారని చెప్పు, మీభయంకరమైన దోపిడీకి విసిగిపోయి తిరగబడ్డారని చెప్పు. కూలీ రేటు 10 రూ॥ రోజుకు పెంచకుంటే రాజమండ్రిదాకావస్తారని చెప్పు. అదిగో ఆలారీ జీప్లని కాల్చినట్లే- నువ్వుకూలీలమీదదౌర్జన్యం చేశావో, పోలీసులని తెచ్చావో ఆమంటల్లోకి నిన్నూ వాళ్ళనీ విసిరేస్తాం తెలిసిందా? శ్రామికులను గౌరవించడం నేర్చుకోండి- నీషోకుకు- నీసౌఖ్యానికి ఈ కూలీలనెత్తురే కారణమని గుర్తుంచుకో." దళనాయకుడు వెలుగు రాసినగొంతుతో చెప్పుతూనే ఉన్నాడు.

మందిలోనుంచి అక్కడికి వెళ్ళినిప్పుపెట్టిన దాదాపు పదిమంది "మేం పది రోజులనుంచి అడవిలో సమ్మె చేస్తుంటే పట్టలేదుగదా! ఇప్పటికైనా మేం ఆకలితో కోపంగా ఉన్నామని చెప్పండి." అరుస్తున్నారు.

డ్రైవర్ ఏదో గొణిగాడు-ఇద్దరు డ్రైవర్లు క్లీనరు పక్కనసడుస్తుండగా నారాయణరావు వెనక్కిమరలాడు. చిటపటలాడుతూ సుళ్లు తిరుగుతూ మంటలు-కూలీల కళ్లల్లో ఆకలిమంటలు- అడవంతా వెలిగిపోతుండగా ఆకాశంలోకి నాలుకలు చాస్తూ మండుతున్నాయి.

---

నడుస్తున్నచరిత్ర :

# 'ధర్మభూమి'

అడవిబాటమీద ఎదురెదురయిన ఒక గిరిజనుడికీ కొందరు తెల్లబట్టల వాళ్ళకూ సంభాషణ :

'నీ పేరేందన్నా?'

'ఆఁ?'

'నీ పేరేంది?'

'ఎందుకులే....'

'ఫరవాలేదు, చెప్పు'

'నాకు పేరు లేదులే....'

అంటూ కావడినుండి వేళ్లాడుతున్న అరటిగెలలలాగ తల ఊపుతూ చకచక బాటమలుపు తిరిగి మాయమవుతాడు. అది తెల్లబట్టల భయమో లేక తెల్లబట్టల పోలీసుల భయమో చెప్పడం కష్టం. ఆ అడవికి ముందు తెల్లబట్టలొచ్చాయి, వాటి వెనకపోలీసులొచ్చారు. ముందొచ్చిన తెల్లబట్టలు వ్యాపారానికీ అడవినరుక్కుపోవడానికీ అడవి భూములు ఆక్రమించుకోవడానికీ వస్తే వెనకవచ్చిన పోలీసులు వాళ్లను గిరిజనులనుండి కాపాడడానికి వచ్చారు.

తూర్పుగోదావరీ విశాఖపట్నం ఏజెన్సీ ప్రాంతం చాలా దట్టమయిన అడవి. గోదావరి ఎగువభాగాననున్న తెలంగాణ మహారాష్ట్ర జిల్లాలకంటె సంపన్నమయిన పచ్చటి అడవి. పెట్టుబడిదార్లకోసం టేకు మద్ది వెదురు ఉంటే అడవిజనం కడుపు నింపడంకోసం చింత అరటి ఉసిరి పనస మామిడీ తోపులున్నాయి. ఈ సంపదే ఇక్కడి గిరిజనులను వెనుకబాటుతనంలో ఉంచిందన్నా లేక నాగరిక సమాజపు దాడిని ఎదుర్కోవడానికి కొంత వెసలుబాటు కలిగించిందన్నా అది ఒకే వాస్తవాన్ని రెండు కోణాలనుండీ చూడడం అవుతుంది. ఆదిలాబాద్ కరీంనగర్ సిరొంచ అడవుల గిరిజనులు మైదానప్రాంతాల దాడికితట్టుకోలేక క్రమక్రమంగా ఆ జీవన విధానానికి లొంగిపోతున్నారు. స్థిరవ్యవసాయానికీ వ్యాపారదోపిడీకీ వేతనకూలీకీ అలవాటు పడుతున్నారు. కోస్తాప్రాంతపు గిరిజనులను ఈ రకమయిన 'ప్రగతి'నుండి అడవి సంపద కొంతమేరకు కాపాడుతున్నట్టుంది. వీళ్ళ జీవితంమీద 'ఆటవిక' ముద్ర ఇంకా చాలా బలంగావుంది. ఆదిలాబాద్ అడవులలో వ్యవసాయానికి భూమి

వ్యాపారానికి ఆకూ కరాని తప్పవేరే ఏమీమిగలలేదు. విశాఖఅడవులలో కడుపునింపే ఫలసంపద, పోడును పోషించే భూసారం, ఇంకా చాల మిగిలిఉన్నాయి.

అయినా వాళ్ళకూ వీళ్ళకూ సమస్యలు ఒకటే. భూస్వామ్యం, వ్యాపారదాహం, ప్రభుత్వపు రెవెన్యూదాహం, అటవీ అధికారుల 'మామూళ్ల' దాహం, తమ అడవిని కబళించేస్తూవుంటే ఆ అడవులలో తమఅస్తిత్వాన్ని ఎట్లాకాపాడుకోవాలా అన్నసమస్య ఇది. కోస్తాప్రాంతపు ఏజెన్సీ ఏరియాలో ఈ సమస్య కొత్తదికాదు. బ్రిటిష్ రెవెన్యూ విధానం ఫలితంగా పుట్టుకొచ్చిన కొత్త ఆర్థిక సంబంధాలు అడవులలో ఈ సమస్యను సృష్టించాయి. 1860 లనుండి ఇక్కడిగిరిజనులు తిరగబడుతూనేవున్నారు. 1920లలో అల్లూరి సీతారామరాజు నాయకత్వంలో భారతదేశచరిత్రలోనే చెప్పుకోదగ్గ తిరుగు బాట్లలో ఒకటయిన 'మన్యపోరాటం' నడిచింది. ఇట్లాతిరగబడ్డప్పుడల్లా ఈప్రాంతా నికి రోడ్లు వచ్చాయి. ఇవ్వాళ ఈ ఏజెన్సీ ప్రాంతమంతా ఎండలో నిగనిగలాడే తారురోడ్లున్నాయి. ఎందుకోసమంటే అటవీ అభివృద్ధికోసం అనిప్రభుత్వంఅంటుంది. పోలీసుల రాకపోకలకోసం అని ప్రజలంటారు. ఈరెండు అవసరాలకూ వైరుధ్యం లేదుకాబట్టి ఇద్దరిమాటా వాస్తవమే. అల్లూరి సీతారామరాజు తిరిగినప్రాంతం, పట్టు బడ్డప్రాంతం, చంపబడ్డప్రాంతం- రంపచోడవరం, అడ్డతీగల, జెడ్డంగి, రాజవు మ్మంగి, కొయ్యూరు, మంప, కృష్ణదేవిపేట, కాకరపాడు- అంతటా మళ్లీ పోలీసు లాకప్‌లలో చిత్రహింసలు, ఆంధ్రప్రదేశ్ స్పెషల్ పోలీస్ కవాతులూ, ఒక పది గ్రామాలలో సాయుధ పోలీసుక్యాంపులూ, ఉన్నాయంటే అది 'అటవీ అభివృద్ధి' చేసుకున్న పుణ్యమేగదా?

విశాఖ జిల్లాకుచెందిన కొన్ని మారుమూల గ్రామాలకథలు చెప్పుకుందాం.

నేరెళ్లబంద ఎత్తయిన కొండమీదవున్నగ్రామం. 'చింతపల్లి ఘాట్' ఎక్కి పెద్దవలస సంతచేరుకోవాలి. అక్కడినుండి పచ్చటి అడవిబాట. బాటకుఒకవైపు లోయలు, లోయలోవాగులు, మరొకవైపు కొండచరియలు కొండచరియలు కొన్ని చోట్ల దట్టంగా చెట్లతోనూ తీగలతోనూ నిండివుంటాయి. అక్కడక్కడ మాత్రం ఎవరో అత్యాధునికమయిన 'వీడింగ్ మెషిన్'తో గడ్డి సహితం మిగలకుండ సాపు చేసినట్టు ఉంటాయి. అది పోడువ్యవసాయంచేసినగుర్తు. అక్కడి మాటల్లోచెప్పా లంటే, 'సున్నగా గెడ్డం గీసినట్టు గీసీస్తరండీ....'

నేరెళ్లబందలోని జనమంతా మూడేళ్లక్రితం అక్కడికి పాడేరుప్రాంతంనుండి వలస వచ్చారు. ఎందుకువచ్చారంటే సమాధానంచెప్పలేరు. వాళ్లకు జీవితంతెలుసుగాని జీవితానికి కారణాలుతెలీవు. తెలియకుండా ఉంచాలనే ఈప్రయత్నమంతా.

వలస వచ్చి కొంత ఖాళీప్రదేశం చూచుకొని ఇళ్లు వేసుకున్నారు. వ్యవసాయం కోసం అయిదెకరాల జాగా చూసుకున్నారు. ఆ ప్రాంతపు ఫారెస్టుగార్డుతో బేరమాడి వెయ్యి రూపాయల డిమాండును ఎనిమిది వందలకు తగ్గించి ఆ ముడుపు చెల్లించుకొని ఆ ఐదెకరాలలో పోడు వ్యవసాయం మొదలుపెట్టారు. రొక్కం మాత్రమే కాకుండ అడిగినప్పుడల్లా కోళ్లు సరఫరా చేసారు. చిన్నకోళ్లిస్తే ఒప్పుకోడట. పెద్దపెద్ద పెట్టలేకావాలట. (ఆ గార్డుపేరు లోవరాజు. అంటే లోయలకు రాజు. ఈ అదృష్టజాతకులు లోయలకేకాదు, అడవులకూ కొండచరియలకూ గూడ రాజులే. వీళ్లకు లంచాలు పెట్టనిదే గిరిజనులు ఇళ్లువేసుకోలేరు, వ్యవసాయంచేసుకోలేరు, మేకలను మేపుకోలేరు). మూడేళ్ల తరువాత లోవరాజు బదిలీఅయి మరొకడు వచ్చాడు.లంచం ముట్టింది.పోయిన వాడికేగాని వచ్చినవాడికి కాదు కాబట్టి వీడు పైవాళ్లకు ఫిర్యాదు చేసినట్టున్నాడు. వాళ్లు హుటాహుటిన గ్రామానికొచ్చిగిరిజనులు సాపు చేసిన ఆ అయిదు ఎకరాలలో 'అటవీ అభివృద్ధి' ప్రారంభించారు. అంటే టేకు మొక్కలు నాటారు. గిరిజనులకు కోపం వచ్చింది. రాజుగారికో జమీందారుకో నజరానాలు చెల్లించుకొని భూమి దున్నుకునే రాచరిక నాగరికత తోవాళ్లకు పరిచయముందిగాని, సిబ్బంది బదిలీ అయినప్పుడల్లా కొత్తగా లంచాలు ఇచ్చుకోవాలనే పెట్టుబడిదారీ బ్యురోక్రాటిక్ నాగరికతవాళ్లకు కొత్త. వాళ్ళు ఆటేకు మొక్కలను పీకేసి తగలబెట్టారు. ఈ 'దౌర్జన్యం' ఫలితంగా నేరెళ్ల బందకూ ఆ పరిసర గ్రామాలకూ పోలీసు క్యాంపులు వచ్చాయి. గిరిజనులకు స్వంత తెలివి ఉండదనీ, ఇంతపని వాళ్లుచేసారంటే నక్సలైట్ల ప్రోద్బలంఉండి ఉండాలనీ, పోలీసుల అనుమానం. నక్సలైట్ల జాడచెప్పమని జనాన్ని వేదించడం మొదలు పెట్టారు. బియ్యం, పప్పు, కోళ్లు, బలవంతంగా తీసుకోవడం మొదలు పెట్టారు. గూడెంకు చెందిన ఒక స్త్రీని చింతపల్లి పోలీస్ స్టేషన్‌లో రెండు రోజులుంచి విపరీతంగా కొట్టారు. ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్ వాళ్లుగూడ అంతవరకుతిన్న లంచాల సంగతి మరచిపోయి 'అడవిలో కట్టెకొడుతున్నారు' అని కేసు పెట్టడం మొదలు పెట్టారు. నేరెళ్లబందలో రెండుసార్లు పోలీస్‌క్యాంపు పెట్టారు. గ్రామానికి తలలో నాలుకగా వున్న బంధు ఇంట్లో పెట్టారు. అందరిలాగే బంధుకుగూడ గోచిపాత తప్పవేరేలేదు. అతన్ని గ్రామస్తులు తమ

'ముసనబు'గా పిలుచుకున్నంత మాత్రాన పోలీసులు లెక్కించలేదు. అతన్ని విపరీతంగా చితగ్గొట్టిలేవలేకుండ చేసారు. ఈ శిక్షఅంతా అయిన తరువాత తాసీల్దారు వచ్చి, ఆ అయిదెకరాలు గిరిజనుల వేననీ, అటవీశాఖవి కావని తీర్పు ఇచ్చాడు. ఈపని ఆయనగారు మొదట్లోనే చేయలేక కాదు-శిక్షపాటికి శిక్షే, న్యాయంపాటికి న్యాయమే. ప్రజలు అన్యాయాన్ని సహించకుండ తిరగబడడమే నేరం. న్యాయాన్యాయాలు తరువాత సంగతి.

తాళ్లపాలెం మరొక మారుమూల గిరిజన గ్రామం. అడవి నుండీ తెచ్చుకున్న కర్రతో కట్టుకున్న ఇళ్లు నలభయ్యో యాభయ్యో ఉంటాయి. ఎండాకాలంలో అడవీ ఊరూ కలిసిపోతాయి. ఊరిమధ్యలో ఒక పెద్దపాక. ఆ పాకలో కూర్చుని ఆడవాళ్లూ మగవాళ్ళు పెద్ద పెద్ద ఆకులను ఎండబెట్టి వంద చొప్పున కట్టలుకడతారు. ఈ ఆకును అడ్డాకు అంటారు. వాటితో విస్తర్లు తయారుచేస్తారు. రూలు ప్రకారం గిరిజనులు ఈ ఆకును గిరిజన కార్పొరేషన్‌కు అమ్మాలి. కానివాళ్లు ప్రైవేట్ వ్యాపారస్తులకే అమ్ముతారు. ఎందుకని అడిగితే, 'మాకు ప్రైవేట్ వ్యాపారస్తులే ప్రభుత్వ కార్పొరేషన్ కన్న ఎక్కువ ఇస్తారు' అని సమాధానం ఇస్తారు ఇది చాలా మందికి చాలా ఆశ్చర్యం కలిగించే విషయం. వ్యాపారస్తులు గిరిజనుల అమాయకత్వాన్ని ఆసరాచేసుకొని అడవిసంపదను కారుచవకగాకొనేస్తున్నారనిగదా గిరిజన కార్పొరేషన్‌లు పెట్టింది. మరి అటువంటప్పుడు ఆ కార్పొరేషన్‌లు వ్యాపారస్తులకంటె తక్కువ రేటుకు గిరిజనుల దగ్గర సరుకు కొనుక్కుంటాయంటే అది 'గిరిజనులను రెచ్చగొట్టటంకోసం చెప్పే అతిశయోక్తిగా' చాలామంది లోకజ్ఞులు సహితం భావిస్తారు. కాని అది వాస్తవమే. అడ్డాకు ఒక కట్టకు (100 ఆకులు) వ్యాపారస్తులు రూ॥3-50 నుండి 5.00 వరకు ఇవాళ ఇస్తున్నారు. (గిరిజనుల పోరాటం ఫలితంగా). కార్పొరేషన్ ఇచ్చేది రూ॥ 0-75 లేక రూ॥ 1.00 ఇస్తుంది. వ్యాపారస్తులు రూ॥ 1-50 ఇస్తారు. (అదే చింతపండు విశాఖపట్నం కిరాణా మార్కెట్‌లో ఒక కిలో రూ॥ 12 నుండి 15 దాకా ఉంటుంది అదివేరే సంగతి).

ఈ విడ్డూరానికి ఒక కారణంవుంది. వ్యాపారస్తులు గిరిజనులనుండి చింతపండయినా అడ్డాకయినా కొనుక్కునేటప్పుడు దాన్ని గిరిజనుల ఆస్తిగా పరిగణిస్తారు. అంటే వాళ్ల వస్తువుకు వెలకట్టిఇస్తారు. (చాలాతక్కువ వెలకడతారనుకొండి. అదివేరే

మాట.) ప్రభుత్వం అట్లాకాదు. ప్రభుత్వం దృష్టిలో దేశంలోని అడవి అంతా తన ఆస్తి. చింతపండయినా అడ్డాకయినా ఈతకల్లయినా ఎండుగడ్డయినా అడవిసంపదంతా తనది. అయితే తానుస్వయంగా చింతపండు ఏరలేదుకాబట్టి, గిరిజనులు ఏరిపెడతారు. ఏరినందుకు ప్రభుత్వం వాళ్లకు కూలిఇస్తుంది. అంటే కార్పొరేషన్ గిరిజనులకు ఇచ్చేది వాళ్ల సేకరించిన వస్తువు వెలకాదు, దాన్ని సేకరించినందుకుకూలి. అందుకే వ్యాపారస్తులు ఇచ్చే ముష్టిపైసలకంటే గూడ అది తక్కువ ఉంటుంది. ఇదంతా విడ్డూరంగా కనబడడానికి కారణం ఏమిటంటే, ప్రభుత్వం ప్రచారంచేసే మార్మికతలో పడిపోయి చాలమంది గిరిజన కార్పొరేషన్‌లు పెట్టింది గిరిజనుల సంక్షేమంకోసమని భావిస్తారు. అసలు ఉద్దేశ్యం అదికాదు. అపారమయిన ఈదేశపు అడవిసంపద చిన్నచిన్న వ్యాపారస్తులచేతిలోనికి పోకుండ, బడాబూర్జువా వర్గానికి ప్రత్యక్ష ప్రాతినిధ్యం వహించే ప్రభుత్వం గుత్తాధిపత్యంలో ఉండడంకోసం. గిరిజన కార్పొరేషన్లకు గిరిజనుల సంక్షేమంతో ఎలాంటి సంబంధంలేదు.

తాళ్లపాలేనికి తిరిగివద్దాం. ఈవూళ్లో మగవాళ్ళకంటే ఆడవాళ్లేఎక్కువ ఉన్నట్టు కనబడతారు. జనాభాలెక్కలు ఎలాగున్నా చొరవమాత్రం ఆడవాళ్లదే. దొడ్డారం పంచాయితీకి తాళ్ళపాలెంనుండి 'నెంబరు' పార్వతి అనే యువతి. ఈమెను గత ఏడాదిలో నాలుగుసార్లు అరెస్టుచేసారు. ఆమె కుండబద్దలు కొట్టినట్టు మాట్లాడడం, నిర్భయంగా ఎదిరించడం, హక్కులు అడగడం, ఇవన్నీచూస్తే పోలీసులకు ఆమెకు నక్సలైట్లతో సంబంధం వుందని అనుమానం. నాలుగుసార్లు అరెస్టుచేయనయితే చేసారుగాని ఆమెను చూస్తే పోలీసులకు జంకే. అందుకే ఆమెమీదచేయిచేసుకోలేదు. కాని అదేగ్రామానికిచెందిన జరమూరు వెంకన్న అనే కుర్రవాడిని మాత్రం మూడు వారాలు లేవకుండ చితగ్గొట్టారు.

ఇంతకీ ఈవూళ్లోగొడవేమిటి? ఈవూరిపక్కనేవున్న అడవినుండి కర్ర స్మగుల్ అవుతూందట. లారీలతోవచ్చి తీసుకుపోతూంటారట. ఫారెస్ట్ అధికార్లూ కాంట్రాక్టర్లూ చేతులుకలిపి, ఒకలారీకి పర్మిట్ రాసుకొని అదే పర్మిట్ మీద నాలుగు లారీలు తోలుకుపోవడం అన్ని అడవిప్రాంతాలలోనూ చాలా మామూలువిషయం.

ఆదిలాబాద్‌నుండి హైదరాబాద్‌కు నేషనల్ హైవేనెంబర్ 7 మీద నిత్యం రొదచేసుకుంటూ తిరిగే టింబర్ లారీలలో నూటికి 20శాతం ఈబాపతువే. అయితే తాళ్లపాలెం ప్రజలుమాత్రం దీన్ని వ్యతిరేకించారట. ఈసారి కర్రగాని స్మగుల్ చేస్తే లారీని కాలబెడతామని బెదిరించారట. దానితో వాళ్లకు నక్సలైట్ సంబంధం వుందని పోలీసులకు అనుమానం పట్టుకుంది. ఆగ్రామాన్ని దాడిచేయడం, 'నక్సలైట్లకు తిండి పెడుతున్నార'ని కొట్టడం, మొదలుపెట్టారు. జనాన్ని బాగా భయకంపితులనుచేసారు. పార్వతిని నర్సీపట్నం, కృష్ణదేవిపేట పోలీస్‌స్టేషన్ల చుట్టూతిప్పారు. పోలీస్ ఆఫీసర్లను వేధించిన సందేహం ఒక్కటే. 'అడవిలో కర్ర స్మగుల్ అయితే అదిఫారెస్ట్ డిపార్ట్‌మెంట్ చూసుకుంటుంది. మధ్యలో ఈవిడకెందుకు?' ఈ ధర్మభూమిలో ఎవరి ధర్మంవాళ్లు చూసుకోవాలి, పరధర్మం జోలికిపోవద్దని శ్రీ కృష్ణపరమాత్ముడు చెప్పలేదా? గీతాసారం పోలీస్ ఆఫీసర్లకు పట్టినట్టు వేరే ఎవ్వరికీపట్టలేదు మనదేశంలో.

కాకరపాడు పెద్దవూరే. అక్కడ ప్రస్తుతం ఆ ప్రాంతాన్నంతా 'కవర్' చేసే పోలీసు క్యాంపు వుంది. ఈ పోలీసు క్యాంపు వెనక వున్న కథ ఇవ్వాళ ప్రభుత్వం వైపు నుండి బాగా ప్రచారం పొందింది. అదేమిటంటే నక్సలైట్లు ఆంధ్రా పేపర్ మిల్స్ వాళ్ల వెదురు డిపోలనూ లారీలనూ తగలబెడుతున్నారనేది.

రాజమండ్రిలో వున్న ఆంధ్రా పేపర్ మిల్స్ బంగూర్ అనే గుత్తపెట్టుబడిదారీ కుటుంబం యాజమాన్యంలో వుంది. తూర్పుగోదావరి, విశాఖ, అడవులనుండి ఈ కాగితపు మిల్లుకు వెదురు (బొంగు) సరఫరా అవుతుంది. ఆ వెదురును పెంచవలసిన అవసరం గూడ బంగూర్లకులేదు. అడవిలో పెరిగే వెదురే సరిపోతుంది. ప్రభుత్వానికి రాయల్టీ మాత్రం చెల్లిస్తారు. ఒక ప్రాంతంలో వెదురు ఒకసారి నరికితే మళ్ళీ మూడేళ్లకు పెరుగుతుంది. విత్తనాలునాటవలసిన అవసరంగానిలేదు. ఇట్లాఫ్రీగా దొరికే ప్రకృతిసంపదను గిరిజనులు నరికి, టన్నుల లెక్కలో కట్టలుకట్టి సరఫరా చేస్తారు. అడవిలో ఎక్కడ వెదురుదొరికితే అక్కడికి వలసపోతారు. ఉత్తరందిక్కుగా పాడేరు, అరకు దాకాపోతే వడమటికి ఖమ్మంఅడవిదాకా పోతారు. ఒకప్పుడు పోడు కోసం వలసవెళ్ళిన గిరిజనులు ఇప్పుడు సీజన్‌వస్తే వెదురును వెతుక్కుంటూ వలస పోతారు. ఉత్పత్తిఅయ్యే వస్తువులోనూ చేసేపద్ధతిలోనూ కొన్ని మార్పులువచ్చాయి గాని ఉత్పత్తిజరిగే పరిస్థితులలో పెద్దమార్పేమీలేదు.

ఒకటన్ను వెదురు నరికి కుప్పబెట్టడానికి ఇద్దరు మనుషులకు (సాధారణంగా భార్యాభర్తలు) మూడురోజులు పడుతుంది. దీనికి ఇచ్చేవేతనం ఒకప్పుడు 5 రూపాయలు రోజుకూలి (ఇద్దరికీ కలిపి), అదనంగా టన్నుకు 20 లేక 25 రూపాయలు (పీస్-రేట్) ఉండేది. అంటే ఇద్దరు వ్యక్తులకు మూడురోజులకు 40 రూపాయలు మించకుండవుండేది. అంటే తలసరి దినవేతనం 6 రూపాయలు చిల్లర. ప్రస్తుతం గిరిజనులు దీని గురించి తీవ్రంగా పోరాటంచేస్తున్నారు. తమ డిమాండు ఒప్పుకోక పోతే పనిమానేయడం. వెదురు డిపోలనూ లారీలనూ కాలబెట్టడం. చేస్తున్నారు. ప్రభుత్వం వైపు నుండి గూడ దీనిగురించి చాలా ప్రచారం, గిరిజనులమీద తీవ్ర నిర్బంధం, వుంది. అయినా ఈ పోరాటం వల్ల వాళ్ల వేతనం 40 రూపాయలు నుండి ఇప్పుడు కొన్నిచోట్ల 70 రూపాయలదాకా పెరిగింది కాబట్టి గిరిజనులు భయపడడం గాని వెనకాడడంగాని కనబడదు.

ఈ విధంగా వెదురు డిపోలు కాలబెట్టిన వూళ్లలో కాకరపాడు ఒకటి. అయితే నక్సలైట్లు ఈ 'అత్యాచారం' చేయబట్టే ఈగ్రామంలో పోలీసులు గూడ పరిసమానంగా అత్యాచారాలు చేయవలసి వస్తోందని అనుకోవడానికి వీలులేదు. ఎందుకంటే కాకరపాడులో రాడికల్స్ సానుభూతిపరుల పైన దాడులు ఇంతకు ముందే మొదలయ్యాయి. 1983 మార్చిలో ఒకసారి, 1984 ఫిబ్రవరిలో ఒకసారి, ఈగ్రామంలో రెండుసార్లు బహిరంగసభలు జరిగాయి. వాటిని జరపడానికి సహాయంచేసారన్న నెపంమీద నర్సీపట్నం పోలీసులు కొందరు గ్రామస్తుల మీద దాడులు చేసారు. మంచి నీళ్ల సప్లయి చేసాడని ఒక చిన్నహోటల్ యజమానిని నర్సీపట్నం లాకప్‌లో బట్టలు విప్పించి చితగ్గొట్టారు. అతని హోటల్‌లో గ్లాసులూ గిన్నెలూ కడిగే కుర్రవాడిని తరిమేసారు. గ్రామంలోని మరొక ఇద్దరు యువకులు పోలీసుల వేధింపుకు తట్టుకోలేక భార్యాబిడ్డలను వదిలిపెట్టి విజయవాడకు పారిపోయారు.

ఇట్లా ఊరూరికీ ఒక కథ. 'నాగరికత' ఇంతకాలం గిరిజనులను కేవలం దోపిడీరూపంలో పరామర్శించింది. ఇప్పుడు పోలీసుడ్రెస్‌లో గూడా వెళ్తోంది. ఈ 'నాగరికతను' వాళ్లు అసహ్యించుకుంటే అసెంబ్లీలో గొడవచేయడం ఎందుకు?

— కె. బాలగోపాల్

సురా

'మరణించిన వాళ్ళని ఎవ్వరు క్రాసు ఎగ్జామిన్ చేయలేరు'

ఇ. హెచ్. కార్.

1982 ఫిబ్రవరి 19 సాయంత్రం ఇంఫాల్‌నుండి ఉక్రుల్ వెళ్ళేదారిలో నాష్తిలాక్ గ్రామానికి దగ్గరగా, భారతప్రభుత్వ సాయుధసైన్యాలకిచెందిన ఒకట్రక్కు మీద నాగా గెరిల్లాలు మెరుపుదాడిచేసారు. ఆ దాడిలో 22 మందిసైనికులు అక్కడి కక్కడే చచ్చిపోయారు. వాళ్ళంతా 21 సిక్ రెజిమెంటు అని పిలవబడే సైనికదళానికి చెందిన వాళ్ళు. మర్నాటినుండి ఆ ప్రాంతమంతా గెరిల్లాలకోసం గాలింపుచర్యలు ఆరంభమయ్యాయి.

తూర్పుపశ్చిమ ఉక్రుల్ జిల్లాలు మణిపూర్ రాష్ట్రంలో నాగాలు నివసించే ప్రాంతం. సుమారు మూడుదశాబ్దాలక్రితం 1956 జూలైతో ఆ ప్రాంతమంతా కల్లోలిత ప్రాంతంగా ప్రకటింపబడింది. అప్పటినుండి ఆర్మీక్యాంపులు ప్రజల సాంఘిక జీవితంలో భాగమయిపోయాయి. ఉద్యమం కాస్త తీవ్రమయినప్పుడల్లా సైనికులు గ్రామాలమీదబడి భీభత్సాన్నిసృష్టించడం ప్రజలందరికి అలవాటయిపోయిన విషయం. కోర్టులు, పత్రికలు, మేధావులు పట్టించుకోకుండా మిగిలిపోయిన వాస్తవం. ఫిబ్రవరి దాడి తర్వాత వందలాది స్త్రీలు, పురుషులు, పిల్లలు, వృద్ధులు నిర్బంధి తులయ్యారు. ఆ ప్రాంతంలో ప్రతిగ్రామంపైనా సైనికులు దాడిచేసారు.

హుయినింగ్ అలాంటి గ్రామాల్లోఒకటి. మొత్తం రెండొందలగడపలయినా లేని ఆవూళ్ళో అంతా వ్యవసాయంమీద ఆధారపడ్డవాళ్ళే. అక్కడ కరెంటులేదు, మంచినీటి సరఫరాలేదు. దవాఖానాఅసలేలేదు. ఉన్నదల్లా ఓ మిడిల్‌స్కూల్, ఓ చర్చి మాత్రమే.

దాడి జరిగిన పదిహేను రోజులకి, పక్కనే ఉన్న పున్‌గ్రాయి క్యాంపు నుండి సైనికులు వచ్చారు. ఇల్లిల్లు వెతికారు. పురుషులందర్ని స్కూలుగ్రౌండ్స్‌కి పట్టుకుపోయారు. స్త్రీలని, పిల్లల్ని చర్చిలో నిర్బంధించారు. మూత్ర విసర్జనకు బయటకి పోతామన్న స్త్రీలను బలవంతంగా సైనికుల సమక్షంలోనే చర్చిలో సిలువ మీద ఆ పనిచేయించారు. ఆ రాత్రంతా వాళ్ళని నానా రకాల చిత్రహింసలకు గురి

చేసి ఉదయాన్నే వెళ్ళిపోయారు సైనికులు. మర్నాడు ఊళ్ళో పెద్దలందరు జిల్లా కమీషనరుకు, ఇతర అధికార్లకి జవాన్ల అత్యాచారాల గురించి మొరపెట్టుకున్నారు. ఆ సంగతి తెలిసి సైనికులు మళ్ళీవచ్చారు. ఆదివారం ఉదయాన్నే, గ్రామంలో ఉన్న ప్రజలందరు చర్చిలో ప్రార్థన సమావేశంలో ఉండగా వాళ్ళు వచ్చారు. (బ్లెస్‌డ్ ఆర్ దోజ్ హూ ఫైట్ ఫర్ దివీక్ – బలహీనమయిన వాళ్ళకోసం పోరాడే వాళ్ళకి క్రీస్తు ఆశీర్వచనాలుంటాయి– బైబిల్) భారత సైన్యాల దేశభక్తియుత, నిర్మాణాత్మక చర్యలను ప్రశంసిస్తూ వాళ్ళ సహాయ సహకారాలకు కృతజ్ఞత చెప్తూ రాసిన సైక్లోస్టయిల్డు సర్టిఫికేట్ల మీద బలవంతంగా సంతకాలు తీసుకున్నారు. ప్రార్థనా సమావేశాన్ని భంగపరిచి ఈ రకంగా ప్రజల్ని బలవంతపెట్టడం మీద ఆ చర్చిలో మతోపన్యాసాలిచ్చే ఫాదరీగారు, స్థానిక మిడిల్ స్కూల్ హెడ్‌మాస్టర్‌గారు అభ్యంతర పెట్టారు. ఆ ఫాదరీగారి పేరు పౌల్, హెడ్‌మాస్టర్‌గారి పేరు డానియల్. మరి రెండో్రోజులు పోయింతరువాత 10వ తేది ఉదయాన్నే సైనికులు మళ్ళీవచ్చారు. పౌల్‌ని డానియల్‌ని నిర్బంధించి చేతులు వెనక్కి విరిచికట్టి, ట్రక్కులో వేసుకొని, పున్‌గ్రియిక్యాంపుకి తీసుకుపోయారు.

వాళ్ళిద్దరి భార్యలను తీసుకొని ఊరిపెద్ద జిల్లాలో పౌరహక్కుల గురించి పట్టించుకొనే ఉక్రుల్ మహిళా సంఘం దగ్గరికి తీసుకుపోయాడు. వాళ్ళు వీళ్ళతోకలిసి జిల్లా డిప్యూటి కమీషనరింటికి పోయారు. రాష్ట్ర రాజధాని ఇంఫాల్ పోయి హోంమంత్రిని కలిసారు. తాను చెయ్యగల్గిందేమీ లేదు. క్యాంపుకెళ్ళి కమాండెంట్ నడగమన్నాడు మంత్రిగారు. మార్చి పదిహేను నాడు పున్‌గ్రియిలో వాళ్ళు క్యాంపు చేరుకునే సమాయనికే పౌల్‌ను, డానియల్‌ని కళ్ళకు గంతలు కట్టి చేతులు వాళ్ళుకట్టి ఆర్మీ జీపులో తీసుకెళ్తుండగా చూసారు. వాళ్ళ కదే ఆఖరి చూపు.

ఈ కథ ఇక్కడే ఆగిపోవాల్సింది. గతమూడున్నర దశాబ్దాలకాలంలో నాగాలాండ్, మణిపూర్, మిజోరామ్ ప్రాంతాలలో ఎంతోమంది కథ అక్కడే ఆగిపోయింది. కాని అదృష్టవశాత్తు ఓ ఐదునెలలుగడిచిన తరువాత ఢిల్లీనుండి ఆరు ప్రజా సంఘాల నిజనిర్ధారణ కమిటీ వాళ్ళవూరొచ్చింది. మరుగున పడిన కథ వివరాలు తెలుసుకొంది. జవాన్లు సంతకం పెట్టించుకున్న సర్టిఫికేటు కాపీ సంపాయించింది. ఈ వివరాల ఆధారంగా ఢిల్లీపియుడిఆర్ (పీపుల్స్ యూనియన్ ఫర్ డెమోక్రటిక్ రైట్స్)

సుప్రీంకోర్టులో ఓ పిటిషను దాఖలుచేసింది. నాగా పీపుల్స్ మూవ్‌మెంట్ ఫర్ హ్యూమన్‌రైట్స్‌కి చెందిన విద్యార్థి సెబస్టియన్ పిటిషన్‌దారుడు. పాల్, డానియల్ ఇద్దరి గురించి ఈ హెబియస్‌కార్పస్ పిటిషన్. 1983 ఫిబ్రవరిలో సుప్రీంకోర్టులో దాఖలయింది.

'హెబియస్ కార్పస్' అనే లాటిన్ పదానికి శరీరాన్ని ప్రవేశపెట్టండి అని అర్థం. భారత" సార్వభౌమ, ప్రజాస్వామిక, లౌకిక, సమసమాజ రిపబ్లిక్ "రాజ్యాంగం ప్రకారం చట్టరూపేణతప్ప మరేవిధంగానూ ఏ పౌరుడి స్వేచ్ఛని, ప్రాణాన్నిహరించే హక్కు ఎవరికీలేదు. ( ఆర్టికల్ 22 ). అరెస్టయిన ప్రతివ్యక్తి 24 గంటలలో మెజిస్ట్రేటుముందు ప్రవేశపెట్టాలి. (ఆర్టికల్ 22, 2 ). ఈ రెండు హక్కులని ఉల్లంఘిస్తే కోర్టుకుపోయి హెబియస్ కార్పస్ పిటిషన్ వేసుకొవచ్చు ( 32, 2 ). (అయితే ప్రభుత్వం నిర్బంధించినట్టు ఋజువు చెయ్యాలనుకోండి. అదివేరే సంగతి), 21సిక్ రెజిమెంటు కమాండర్, మణిపూర్ రాష్ట్రప్రభుత్వం. కేంద్రప్రభుత్వరక్షణ. గృహ మంత్రిత్వశాఖల్ని వాళ్ళిద్దర్ని కోర్టులో ప్రవేశపెట్టవలసిందిగా కోరుతూ పియుడి ఆర్ ఓ హెబియస్ కార్పస్ పిటిషన్ వేసింది.

ప్రభుత్వం తరపున రక్షణ మంత్రిత్వశాఖ సహాయ కార్యదర్శి సమాధానం ఇచ్చాడు. వాళ్లిద్దర్ని అరెస్టు చేయలేదని, కేవలం కొందరు అనుమానితుల్ని గుర్తించే నిమిత్తం తీసికెళ్ళి మర్నాడు వదిలేసామని ఆయనకథనం, మీరు ఏ డాక్యు మెంట్లు ఆధారంగా ఈ విషయాలు చెప్తున్నారని కోర్టు ప్రశ్నించిన వెంటనే ఆ సహాయ కార్యదర్శి మారి మరొకాయన వచ్చాడు. ఈ లోగా మూడునెలలు గడిచాయి ఏ ఆధారాలు లేవని ఈ రెండో ఆయన చెప్పాడు. ఏ ఆధారాలు లేకుండా విడుదల చేసారని ఎలా చెప్పగలుగుతున్నారయ్యా అంటే ఆయన మార్చి మరో సహాయ కార్యదర్శి వచ్చాడు. ఈలోగా మరో మూడు నెలలు గడిచాయి. ఈ మూడోఆయన మా దగ్గరడాక్యుమెంట్లు ఉన్నాయిగాని దేశభద్రతా ప్రయోజనాల రీత్యా ఆ డాక్యుమెంట్లు మీకుచూపించమన్నాడు. పియుడిఆర్‌కు మేంచూపించం గాని మీరు మాకు చూపించండి అని కోర్టు ఆదేశిస్తే అవి ప్రవేశపెట్టక తప్పలేదు. కోర్టు అవన్నీ దొంగ పత్రాలని (స్పూరియస్ డాక్యుమెంట్స్) అని కొట్టిపారేసి వాళ్ళిద్దర్ని డిసెంబర్ 12న కోర్టులో ప్రవేశపెట్టమని ఆదేశించింది. ఈ మొత్తం వ్యవహారమంతా 11నెలలు గడిచింది.

తనకున్న "వనరులు, సౌకర్యాలు, కోరిక, పట్టుదల" అంతా పెట్టి ప్రయత్నిం చినా వాళ్ళిద్దర్నీ ప్రవేశపెట్టలేక పోతున్నామని ప్రభుత్వం చెప్పుకొంది. (With all the resources, facilities and will at its Commond he Union government expresses its inability to produce them) సి.బి.ఐ. విచారణను చేస్తున్నామని ప్రకటించింది. మరొ మూడునెలలు గడిచాక ఈశాన్య ప్రాంతంలో ఉన్న ఆర్మీ క్యాంపులలో ఎక్కడా లేరని సిబిఐ తన నివేదికలో పేర్కొంది. ఆఖరికి ఏప్రిల్ 22, 1984న రెండు సంవత్సరాలు గడిచింతర్వాత కోర్టు తన తీర్పు ప్రకటించింది. మామూలుగా ప్రభుత్వం చెప్పేకథలో లాగా ఎన్‌కౌంటర్లలో మరణించలేదు గాని, వాళ్ళు అసహజ మరణానికి గురిఅయ్యారని కోర్టు నిర్ణయాని కొచ్చింది. ఇద్దరు భార్యలకు చెరొక లక్షరూపాయలు నష్ట పరిహారం ఇవ్వాలనీ, 21 సిక్ రెజిమెంట్ మీద హత్యానేరంపై విచారణ జరపాలనీ తీర్పు ఇచ్చింది. ఆఖరిరోజున ప్రభుత్వ న్యాయవాది మరింత టైము కావాలని పెట్టుకున్న అభ్యర్థను తోసివేస్తూ, "ఎండమావులను అన్వేషించడానికి" తాము సిద్ధంగా లేమని సుప్రీంకోర్టు తీర్పులో ప్రకటించింది.

పౌల్, డానియల్ కుటుంబాలకు ఈ ఎండమావులులేవు. హుయినింగ్ గ్రామస్థులకి ఈ ఎండమావులులేవు. నిజానికి పిటీషన్ దాఖలుచేసిన పియుడిఆర్‌కికూడా ఈ ఎండ మావులులేవు. వాళ్ళిద్దరు ఏమయిపోయారో, ఎలాపోయారో అందరికి ముందునుండి తెలుసు. గత మూడున్నర దశాబ్దాల కాలంలో పోలీసులక్యాంపులలోనో, సైన్యాల చేతులలోనో చిత్రహింసలకు గురయి హత్యచేయబడ్డ వందలాది ప్రజలకి అప్పుడు, ఇప్పుడు ఎండమావులులేవు. దారిద్ర్యంలోనూ, పోరాటంలోనూ భయంకర వాస్తవికతలో సహజీవనం చేసేవాళ్ళకి ఎండమావికూడా ఒక విలాసవస్తువే. ఉంటే ఈ ఎండమావి, పరస్పర విరుద్ధమైన చట్టాలలో ఉంది. అక్కడినుండి న్యాయాన్ని ఆశించేవాళ్ళ విశ్వాసాలలోఉంది. 21 సిక్ రెజిమెంటు పై హత్యానేరానికి శిక్ష పడుతుందని ఎదురు చూసే వాళ్ళ తప్పుడు చైతన్యంలోఉంది. శవాలమీద పరిపాలించే రాజ్యం శరీరాన్ని ప్రవేశ పెట్టలేదు.

# రాకేష్ రాకెట్ ప్రయాణం

సి. ఎస్.

నూటముప్పైఏడుగురు (137) అంతరిక్షంలోకిపోయిన తరువాత భారతదేశం నుండి మొదటివాడిగా, ప్రపంచంలో నూటముప్పైఎనిమిదవ (138)వాడిగా అంతరిక్షంలోకి రాకేష్‌శర్మ సోయజ్, టి- 11లో మరొక ఇద్దరు అంతరిక్షనావికులతో బైకనూర్ కాస్మోడ్రోంనుండి రష్యాచే ఏప్రిల్, 3, 1984న పంపబడ్డాడు.

రష్యాకు తనతొత్తులైన దేశాలనుండి కొందరిని ఎన్నుకొని అంతరిక్షంలోకి పంపడం మామూలే. అయాత్రవలన ఆయాదేశాలకు చెప్పుకోతగ్గ ఉపయోగం ఏమీ ఉండదు. ఆయాదేశాలలో తానుచేసే వివిధరకాల దోపిడీలు చాలక అంతరిక్షయాత్రల ద్వారాకూడా దోపిడీమొదలుపెట్టింది. సాధారణంగా ఇలాంటి సంయుక్తయాత్రలలో రష్యాచేసుకొనే ప్రయోగాలే ఎక్కువగావుంటాయి. ఎక్కువ ఉపయోగాలు రష్యాయేపొందుతుంది. "మిత్ర" దేశాలకు ఆయాత్రవలన ఉపయోగాలు చాలాతక్కువగా వుంటాయి, "మేమూమనిషిని అంతరిక్షంలోకి పంపాము" అన్న ఘనత తప్ప, ఆ ఘనతవలన ఉపయోగం ఏమిటి?. 138వ వాడిగా, 140వ వాడిగా అంతరిక్షంలోకి పోవడంలో ఉన్నఘనతమాత్రంఏముంది? ఆ యాత్రలకు అయ్యే ఖర్చులో కొంతప్రత్యక్షంగానో పరోక్షంగానో ఆ "మిత్ర" దేశలే భరిస్తాయి. ఖర్చుకు తగిన సాంకేతికఫలితం ఆ "మిత్ర"దేశాలు పొందలేవు. తన "మిత్ర"దేశాలు తనలో కలవడంవలన రష్యా తన ప్రయోగాలు తక్కువఖర్చుతో చేసుకోగలుగుతుంది. ఆ దేశాలు తన అధీనంలో ఉన్నాయని పదే పదే నిరూపిస్తుందిరష్యా. రష్యా ఈవిధంగా తన "ఇంటర్‌కాస్మాస్‌ప్రోగ్రాం"తోటి తన "మిత్ర" దేశాల ఖర్చుతో తన ప్రయోగాలు చేసుకుంటుంది అంతరిక్షంలో.

ఇట్లా ఖర్చుమిగుల్చుకోవడమేకాకుండ, రష్యాకు ఈ సంయుక్త ప్రయోగాల వల్ల వేరేప్రయోజనాలు (ఆర్థిక ప్రయోజనం కంటే ముఖ్యమయినవి) ఉంటాయి. ఒకటి, తన "మిత్ర"దేశాలుగా చెప్పబడే మూడవ ప్రపంచదేశాలు తనమీద సాంకేతికంగా ఆధారపడిఉండేలాగా చేసుకోవడం, రెండు, తానుబడుగుదేశాల బంధువునని ప్రచారంచేసుకోవడం. (సోవియట్ రష్యా తనగురించితాను చేసుకునే ప్రచారమును, అంతర్జాతీయంగా రివిజనిస్టులంతా సోవియట్ రష్యాను ఘనంగా కీర్తిస్తూచేసే ప్రచారంలోనూ, ఇది ముఖ్యమయిన అంశం) మూడు, ఈ బడుగుదేశాలను తనఅధీనంలో ఉంచడానికి తనదళార్లగా పనిచేసే ఆయాదేశాల పాలకవర్గాలకు వారి ప్రజల దృష్టిలో ప్రతిష్ట సంపాదించిపెట్టడం.

మన భారతదేశం విషయానికి వద్దాం.

దారిద్రానికి నిలయమైన దేశాలలో మనదేశం ఒకటి. తిండి, బట్ట, ఇల్లులాంటి ప్రాథమిక అవసరాలుతీరనిమనదేశం కొన్ని కోట్లరూపాయలు అంతరిక్షప్రయోగాలకు ఖర్చుచేస్తుంది

మన "ఐ ఎస్. ఆర్. ఒ. "యొక్క భాగమయిన" విక్రమ్ సారాభాయి అంతరిక్ష కేంద్రం నుండి వారానికి రెండు సౌండింగ్ రాకెట్లుపేలుస్తారు. వీటికి అయ్యే ఖర్చుమొత్తం ఒకకోటిరూపాయలు. అంతఖర్చుచేసి రాకెట్ ప్రయోగంవలన తెలుసుకునే వైజ్ఞానిక సమాచారం తక్కువ. ఉదాహరణకు 100 కి. మీ ఎత్తునుండి 300 కి. మీ ఎత్తులోపల వాతావరణ సాంద్రత తెల్సుకుంటారు. ఇటువంటివే మరికొన్ని సాంకేతిక ప్రయోగాలుచేస్తారు. ఈప్రయోగాలు భూమిమీదనుండే చేయవచ్చు. రాకెట్లు ఉపయోగించడం. దండగ. "రాకెట్లు ఉపయోగిస్తున్నాం అని గొప్ప చెప్పుకోవడానికి తప్ప". అసలు మనలాంటి బీదదేశాలు ప్రజల ప్రాథమిక అవసరాలు తీర్చకుండా అంతరిక్ష పరిశోధనపేరుతో పందలకోట్లరూపాయలు ఖర్చుచేయడమే వృధా. ఈ ప్రయోగాలలో ఉపయోగించే పరికరాలుచాలవరకూ అమెరికా, ఫ్రాన్స్, జపాన్ దేశాల నుండి దిగుమతి చేసుకుంటున్నారు చివరకుకొన్ని "ఇంటిగ్రేటెడ్‌చిప్స్", రెసిస్టార్లు "కెపాసిటర్లు" వంటి సామాన్య పరికరాలు ఇతరదేశాల నుండి దిగుమతి చేసుకూంటున్నారు. రాకెట్ ప్రయోగాలకు అవసరమైన ప్రమాణాలను అనుసరించి మన గొప్ప గొప్ప కంపెనీలు ఈపరికరాలను తయారు చెయ్యలేకపోతున్నాయి. మనంఈస్థితిలో వుండగా అంతరిక్షంలోకి మనిషిని ఇతరదేశాలనుండి పంపడంవలనఉపయోగమేమిటి? రాబోయే 5, 10 సంవత్సరాలలో మనిషిని మనరాకెట్‌లో, మనదేశంనుండి పంపగలరా? అలాంటప్పుడు "రాకేష్," మల్హోత్రాలకు దాదాపు 15నెలలు శిక్షణ ఇవ్వడంవలన ఉపయోగం ఏమిటి? వారిశిక్షణ మనం ఏవిధంగానూ ఈ సమీప భవిష్యత్తులో ఉపయోగించుకోలేము.

రాకేష్ అంతరిక్షంలో చేసిన ప్రయోగాలు గురించి చూద్దాం.

1) యోగాసనాలు వేసాడట. యోగాసనాలకు సంబంధించిన ఒక నమ్మకంవుంది. యోగంవలన గాలిలో తేలిపోవచ్చునని నమ్ముతారు అలాతేలిపోయేటట్లయితే ఈ "యోగుల"నే రాకెట్లకి బదులు పైకి పంపిప్రయోగాలు చేయించ వచ్చుకదా! ఈ అంతరిక్షపరిశోధన, ఈరాకెట్లు ఎందుకు. ఇలామనిషి గాలిలో ఎగరడం అనేది భౌతిక సూత్రాల కేవిరుద్ధం. అలాంటిది, యోగాసనాలవల్ల బరువులేనిస్థితి కలుగుతుందేమోనని, అంతరిక్ష యాత్రలలో మానసిక వత్తడులను లేకుండా చేయవచ్చు

నేమోనని రాకేశ్‌శర్మ ప్రయోగాలు చేసాడట. ఇదిఎంతశాస్త్రీయంగా వుందో ఆలోచించవల్సిన విషయం.

2) అంతరిక్ష ఫోటోగ్రఫీ—సాల్యూట్-7 అనే ఈ శాశ్వత అంతరిక్ష ప్రయోగశాలలో వున్న "మల్టీస్పెక్టర్ కెమెరా" తోటి మన "రాకేష్" ఫోటోలు అంతరిక్షలోకి పోయితీసాడట. అంటే ఈ "కెమెరా" మనది కాదు, అది రష్యావాళ్ళ "సాల్యూట్–7" లోనే శాశ్వతంగా అమర్చబడివుంది. మనరాకేశ్ చేసిన పని ఏమిటంటే రాకెట్‌లోపోయి ఆ "కెమెరా"ని "క్లిక్" కొట్టివచ్చాడు ఆ పనికోసం భారతదేశం నుండి రష్యాపోయి, అక్కడ 15 నెలలుశిక్షణ పొంది, అంతరిక్షంలోకిపోయి ఫోటోలు తీసిరావాలా! ఆ ఫోటోగ్రాఫర్ పని మన "మిత్ర" దేశ కాస్మోనాట్లు ఇంతకన్నా తక్కువ ఖర్చుతో చేయలేరా?'

ఇంకా మిగిలిన ప్రయోగాలు అంతరిక్షంలో వెల్డింగ్, సోల్డరింగ్ మొదలయినవి చేసాడన్నది బోగస్. ఎందుకంటే అవన్నీ చేయకుండా రష్యా అంతరిక్షంలో అంతరిక్ష ప్రయోగశాల ఎట్లానిర్మించింది? ఆ ప్రయోగాలు మళ్ళీ ప్రత్యేకంగా చేయడం ఎందుకు, ఆ సమాచారం మన "మిత్ర" దేశం మనకు అందివ్వలేదా! ఈ ప్రయోగాలు చేయడానికి 'రాకేష్'ను "అంతరిక్షంలో"కి పంపారనేదసలు ఇందిరా ప్రభుత్వం రాజకీయ స్టంట్ అనడం న్యాయం. రాబోయే ఎన్నికలలోవాళ్ళు చేసిన గొప్పపనులుగా చెప్పుకొనడానికి ఉపయోగ పడుతుంది, మా ప్రభుత్వ హయాంలో "ఆసియా క్రీడలు జరిపాం," "అంతరిక్షంలోకి'మనిషిని' పంపాం"అని ఇలా మా ప్రభుత్వం మంచి పనులు చేసింది అని చెప్పుకోవడానికి.

రష్యా తనదేశంలో ఒక రోడ్డుకి "రాకేష్" పేరు పెట్టడం, ఒక కుర్రవాడికి రాకేష్ పేరు పెట్టడం అంతా, తమకు భారతదేశమంటే చాలా ప్రేమవుంది. అనిమన ప్రజలలో అభిప్రాయం కలిగించడానికి, తాను మన "మిత"దేశం అని చెప్పుకోవడానికి, ఆ ముసుగులో ఇంకా మన దేశాన్నిదోచుకోవడానికి ఉపయోగపడుతుంది. అన్నిటికంటే ముఖ్యంగా అయుధరంగంలో ఇప్పటికే రష్యా మీద చాలా బలంగా ఆధారపడి వున్న భారతదేశం తనపరాధీనతను మరొక మెట్టుపైకి తీసుకుపోవడం జరుగుతుంది. ఈ రకమయిన అంతరిక్ష సహకారం వల్ల సోవియట్ రష్యా యొక్క అంతర్జాతీయ యుద్ధవ్యూహంలో భారతదేశం మరింతబలంగా చిక్కుకుంటుంది. అంతరిక్షప్రయోగాలు విజ్ఞానం కోసం అని అమెరికా, రష్యాలు చెప్పుకుంటున్నాయి కానీ వాస్తవానికి వాటికి వైజ్ఞానిక ప్రయోజనం కంటే గూఢచారి ప్రయోజనం. యుద్ధప్రయోజనం. సోవియట్ రష్యా ఎక్కువ. యుద్ధప్రయోజనాలకు ఇంతవరకూ పరోక్షంగానే తప్పప్రత్యక్షంగా భారతదేశం ఉపయోగపడలేదు. ఇప్పుడు ప్రత్యక్షంగా ఉపయోగపడబోతుందని అనుకోవచ్చునేమో!

పుస్తక సమీక్ష :

# జానకి విముక్తి

(మే సంచిక తరువాయి)

## ప్రస్తుత విప్లవోద్యమం

విప్లవోద్యమం ప్రస్తుతం లేదని, ఉన్నా అది "ఆరోగ్యంగా" లేదని చెప్పడానికి రంగనాయకమ్మ చాలపేజీలే కేటాయించారు.

"ఒక మనిషి దొరికాడంటే, అతనికి సిద్ధాంతజ్ఞానం ఇచ్చి, అతనితో చర్చలు చేసి, అతని అవగాహనని బట్టి అతనితో ప్రవర్తించే సరైన పద్ధతి ఇవాళ కమ్యూనిస్టుల్లో లేదు. ఆ మనిషిని తమ పక్షానికి చేర్చుకోవడానికి ఎన్నిఅడ్డదారులు వీలయితే అన్ని అడ్డదారుల్లో ప్రయత్నిస్తారుగానీ అసలు పద్ధతిలో మాత్రం ప్రయత్నించరు...." (2, 106)

"....ప్రజలకి ఏమీ చెప్పక్కర్లేదనే కమ్యూనిస్టులు కొందరూ, చెప్పడానికి అప్పుడే సమయం కాదనేవాళ్ళుకొందరూ, చెప్పకుండానే చెప్పేశాం అనుకునే వాళ్ళు కొందరూ- అన్నీ తప్పుడు వాదాలే...." (3. 618)

"....ఇన్ని పార్టీలవాళ్ళు, గ్రూపులవాళ్ళు ప్రజల్లోకి అంతలోతుగా చొచ్చుకుపోయి మమేకం అయిపోతూఉంటే యాభైఏళ్ళనుంచీ కమ్యూనిస్టులు ఇంత కృషి చేస్తూ ఉంటే "కమ్యూనిజం" అనేమాట ఒక్కడికీ తెలీదేం? తెలిసినవాళ్ళకి కూడ కమ్యూనిస్టులంటే అంత దురభిప్రాయం ఎందుకు? వీళ్ళు చొచ్చుకు పోయేది ఎవరిలోకి?...." (3. 620)

అనీ, మరో రెండూపేజీల పాటుకూడ ఉన్న కమ్యూనిస్టులందర్నీ తిట్టి సత్యం జానకికి కర్తవ్యం ఉపదేశిస్తాడు. "ప్రజలు తప్పుడు నాయ్యకత్వాల్ని తిరస్కరించడం నేర్చుకోవడంలోనే వాళ్ళని వాళ్ళు జ్ఞానవంతుల్ని చేసుకుంటారు. ఆ జ్ఞానమే మంచి నాయకత్వాన్ని తయారుచేసుకోవడానికి దారితీస్తుంది. మనపని, మొట్టమొదట తప్పుడు నాయకత్వాన్ని తిరస్కరించడం నేర్చుకోవడమే...." (3, 622)

పార్టీలమీద, గ్రూపులమీద సత్యంచేసిన ఆరోపణలలో కొన్ని పాక్షిక సత్యాలున్నాయిగనుకనే ఆ ఆరోపణలు నిజాలలాగ భ్రమకలిగిస్తున్నాయి. ఒకవేళ ఆ ఆరోపణలన్నీ పూర్తిగా నిజమైనవైనా సత్యం ఉపదేశించిన కర్తవ్యం నిజమైన కర్తవ్యం

కాదు. తప్పుడునాయకత్వాల్ని తిరస్కరించే చైతన్యం జనానికందవలసిందే. వాళ్ళది అందుకుంటారు కూడా. ఐతే ఈ నెగెటివ్ కార్యక్రమం (అదికూడా మాటల్లోనే!)తో పాటు సత్యాలకి "సరైన నాయకత్వాన్ని" ప్రజలకందించే పాజిటివ్ఆచరణ కార్యక్రమం ఉండవలసి ఉంటుంది. అదివాళ్ళ బాధ్యత.

సత్యం తన ఆరోపణలలో భాగంగా ఆయాపార్టీలో గ్రూపులో నడిపిన ఉద్యమాలను ప్రస్తావించి అవన్నీ శుద్ధ దండగ ఉద్యమాలని కొట్టిపారేస్తాడు. ముఖ్యమంత్రి మార్పు, కాల్పుల మీద న్యాయవిచారణ, మృతుల కుటుంబాలకు నష్ట పరిహారం—సత్యం మాటల్లో ఇవి ఆఉద్యమ డిమాండ్లు. సత్యం ప్రత్యేకంగా అది ఏ ఉద్యమమో చెప్పలేదు గాని, ఈ మూడు డిమాండ్లతో పాటు మరి రెండు డిమాండ్లు కలిసి సాగిన ఉద్యమం ఇంద్రవెల్లి కాల్పుల వ్యతిరేక ఆందోళన. ఈ ఉద్యమానికి నాయకత్వం వహించిన పార్టీ కేవలం ఈ ఉద్యమమే నడపలేదన్నది ఒక ముఖ్య విషయమైతే. ఐదు డిమాండ్లలో సత్యం తన అవసరంకోసం, తానుచెప్పేది నెగ్గించు కోవడం కోసం రెండుడిమాండ్లు వదిలేసి వక్రీకరణకు పాల్పడ్డాడన్నది మరొక ముఖ్య అంశం. సత్యం చెప్పిన డిమాండ్లతోనే పూర్తిగా ఉద్యమాలునడిపితే అది అభ్యంతర కరమే. అది కేవలం ఆర్థికవాదంగానే మిగిలిపోయి, ప్రజాచైతన్యం అభివృద్ధికావ డాన్ని ఒక పరిమితి దగ్గర ఆపేస్తుంది. కాని వర్గపోరాటంలో నిమగ్నమైఉన్న ఒకపార్టీ ఆ డిమాండ్లతోనే మిగిలిపోదు. వర్గపోరాటం చెప్పేపార్టీకూడ తప్పకుండా ఆర్థికవాద డిమాండ్లు పెడుతుంది అవి జనంచైతాన్యాన్ని కొంతవరకు పెంచడానికి మాత్రమే ఉపయోగపడతాయి. కాని అంతకంటె ముఖ్యంగా ఆపార్టీ రాజకీయ డిమాండ్లు, ప్రజారాజకీయ డిమాండ్లు పెడుతుంది, సత్యం అవసరంకోసం వదిలేసిన ఆ రెండు డిమాండ్లూ అలాంటివే. ఒకటి, గిరిజనులు సాగుచేసుకుంటున్న భూములన్నీ వాళ్ళకే చెందేటట్లు పట్టాలివ్వాలనేది, రెండోది, అన్నిగ్రామాలనుంచి పోలీసు క్యాంపులు ఎత్తివేయాలనేది.

## జీవితంలో రాజ్యాంగ యంత్రం

'జానకివిముక్తి'లో మరొక ప్రధాన లోపం జీవితంలో రాజ్యాంగ యంత్రం పాత్ర మచ్చుకైనా కనబడకపోవడం. మనందరి జీవితాలలో రాజ్యాంగ యంత్రం చాలా ఎక్కువ పాత్ర వహిస్తున్నది.రోజు రోజుకూ అది మన జీవితాలలోకి చొచ్చుకు వస్తున్నది. ముఖ్యంగా పోలీసు వ్యవస్థ మన జీవితాల మీద దురాక్రమణ చేస్తున్నది.

ఈ పుస్తకంలో మాత్రం రాజ్యాంగయంత్రం మాటే ఎక్కడాలేదు. మొదటి 1132 పేజీల్లో పోలీసు యంత్రాంగం ఉన్నట్టే తోచదు. చివరి 12 పేజీల్లో మాత్రం ఒక లాఠీ చార్జీ, రెండు అరెస్టులూ ఉంటాయి. మార్క్సిస్టు చైతన్యం గల వ్యక్తుల బృందం ఒకటి 70ల కల్లోల దశాబ్దంలో 1132 పేజీల పాటు పోలీసులు అడ్డురాకుండా చర్చలతో గడుపుకు రావడం జానకి విముక్తి నవలకే చెల్లింది! ఇది ఎంత హాస్యాస్పదమో, సత్యదూరమో ఇవాళ్టి తెలంగాణ జిల్లాల నిర్బంధం చూసిన, విన్న, అనుభవించిన వారికెవరికైనా తెలుస్తుంది. 'జానకి విముక్తి' లోని స్టడీ సర్కిల్' లాగ కూచుని మాట్లాడుకున్నందుకే ఎందరెందరో కార్యకర్తలు, విద్యార్థులు, మేధావులు పోలీసుల చేతుల్లో చిత్రహింసలనుభవిస్తున్న కాలంలో ఈ 'స్టడీ సర్కిల్' చిత్రణ వాస్తవం నుంచి పలాయనమవుతుందేగాని మార్క్సిజానికి నిబద్ధత కాదు.

## చైతన్యస్థాయి

రెండో భాగం ముందుమాటలో చెప్పినట్టు ఈ నవల రాయడంలో రంగనాయకమ్మ ముఖ్యోద్దేశం "చైతన్యస్థాయిని బట్టి కార్యక్రమం నిర్ణయించాలన్నది". ఈ అంశానికి సంబంధించిన చర్చ పుస్తకంలో చాలా వివరంగా సాగింది. చైతన్యస్థాయిని బట్టే కార్యక్రమం నిర్ణయించాలనడంలో ఎవరికీ భేదాభిప్రాయంలేదు. కాని ఈ చర్చ లేవనెత్తుతున్న వాళ్ళందరూ కావాలనో, తెలియకనో ఒక అంశం, ఒక వాస్తవం విస్మరిస్తున్నారు. చైతన్యస్థాయి అనేది ఎక్కడో ఆకాశం నుంచి ఊడిపడేదిగా, జీవితానికీ, దానికీభేదం చూపుతున్నారు. ఇది తప్పు. సమాజానికైనా వ్యక్తికైనా జీవితక్రమమే చైతన్యస్థాయి అభివృద్ధి క్రమం. వ్యక్తిలో ఈ అభివృద్ధి అస్పష్టంగా ఉండవచ్చును, ఒకోసారి అసలే ఉండక పోవచ్చును. కాని సమాజానికి మాత్రం అది అనివార్యక్రమమే. ఆ చైతన్యస్థాయిని ఎవరో బైటినుంచి నిర్దేశించరు. ఆపాదించరు. చరిత్ర ఆ సమాజాన్ని ఆ చైతన్యస్థాయిలోకి ఆవిష్కరిస్తుంది. ఈ విషయాన్ని రంగనాయకమ్మ మరోచోట సరిగా గుర్తించారు "....సమస్యల పరంపరలో దేన్నిబట్టి ఏది పుట్టుకొస్తుందో తెలిస్తేనే, దేన్నిబట్టి ఏది పరిష్కారమవుతుందోకూడ తెలుస్తుంది. సమస్యలు పరిష్కారమవ్వాలంటే ఏది ముందో, ఏది వెనుకో వాటి స్వభావాన్ని బట్టి అవే ఒక క్రమాన్ని తీసుకుంటాయి. వాటికవే ఒక క్రమంలో నిలబడతాయి. కమ్యూనిస్టులు ఆ క్రమాన్ని నిర్ణయించరు. దాన్ని అర్థం చేసుకుంటారు, గ్రహిస్తారు, గ్రహించి ఆ క్రమానికి తగ్గట్టుగా పని చేస్తారు...." (3.110)

చైతన్యస్థాయి మూలాన్ని గురించి ఇంత సరైన అవగాహన ఉన్న రంగనాయకమ్మ హఠాత్తుగా తప్పుడు అవగాహనలోకి వెళ్ళిపోయి చైతన్యస్థాయి ఎక్కడినుంచో వస్తుందన్నట్లూ, అది వచ్చేవరకూ కార్యక్రమం నిర్ణయించొద్దన్నట్లూ చర్చించడం ఆశ్చర్యమని పిస్తుంది. చైతన్యస్థాయికీ, ఆచరణకూ ఉన్న అన్యోన్య, గతితార్కిక సంబంధాన్ని రంగనాయకమ్మ గుర్తించి ఉండవలసింది.

## కమ్యూనిస్టుల సాంఘిక జీవితం

కమ్యూనిస్టులు కాదలచుకున్న వాళ్ళ సాంఘిక జీవితాల్ని గురించీ, రోజువారీ ప్రవర్తన గురించీ నవల చాల విపులంగా చర్చించింది. కమ్యూనిజం ఒక జీవిత విధానమని రంగనాయకమ్మ జీవితం ద్వారాకాక సిద్ధాంతంద్వారా వివరించడానికి ప్రయత్నించారు. ఈ పద్ధతివల్ల కమ్యూనిస్టు జీవితవిధానాన్ని సిడివాదంతో చిత్రించ వచ్చునేమోగాని, జీవితంలో కమ్యూనిస్టు విలువల్ని చిత్రించడం కష్టం. 'జానకి విముక్తి' ఈలోపాన్ని అధిగమించ లేక పోయింది.

ఈ అంశానికి సంబంధించి రంగనాయకమ్మవాదనలను వేషభాషలు, ఇంట్లో ప్రవర్తన, సంఘభీతి అనే మూడుభాగాలు చేయవచ్చును. వేషభాషలు, ఇంట్లో ప్రవర్తన విషయాలలో రంగనాయకమ్మ స్థూలంగా సరైన అంశాలనే ప్రతిపాదించారు. సంఘభీతి విషయంలో మాత్రం అవసరమైన దృక్పథాన్ని చెప్పలేదు, తప్పుడు అభిప్రాయాలను ప్రతిపాదించారు.

వేషభాషలకు సంబంధించి సరైన అభిప్రాయంకోసం రంగనాయకమ్మనే కోట్ చేయాలంటే "వ్యక్తి జీవితాశయాల్నిబట్టే వేషభాషలువుండి తీరాలనేది నూటికినూరు పాళ్ళూ ఒప్పుకోవాల్సిన విషయం...." (3. 232). ఈ అంశంసరైందే. కాని రంగనాయకమ్మ ఈ వేషభాషలమీద, అసలు మన జీవితంమీద జీవితాశయమే కాక సంఘంవేసే ప్రభావాన్ని, సంఘంకలగజేసే అవసరాలను, సంఘంవిధించే పరిమితులను గుర్తించలేదనేచెప్పాలి, మనవేషభాషల చర్చకు మనజీవితాశయం మాత్రమేకాక సంఘంకూడ నేపధ్యంగా ఉండాలనేది రంగనాయకమ్మ గుర్తించనేలేదు. ఈ రెండు అంశాలనూ ప్రాతిపదికగా తీసుకొని చర్చచేయాలిగాని, సంఘాన్నివదిలేసి, జీవితాశయాల ఆధారంగానే వేషభాషల చర్చచేస్తే అదికేవలం ఊహాత్మకతో, ఆదర్శవాదమో అయిపోతుంది, 'జానకి విముక్తి'లో వేషభాషలచర్చ సరిగ్గా అక్కడే ముగిసింది.

వేషభాషల్లో ఫ్యూడల్ విలువలు ఉన్న సమాజంలో సంస్కరణ వాదంకూడ కోరదగిందే. కాని 'జానకి విముక్తి' పద్ధతి సంస్కరణవాదం పట్టణప్రాంతాల మధ్యతరగతిని దాటి అట్టడుగు వర్గాలకు అందడం సాధ్యమనిపించదు. మూడో భాగం 227-31 పేజీల్లో శాంత, సత్యం, ఉషలమధ్య బొట్టు, నగల విషయంలో జరిగిన చర్చ స్థూలంగా సమంజసంగానే ఉంది. ఐతే ఎక్కడా నగలు, బొట్టుల పుట్టుక, పెరుగుదలగురించి చారిత్రికంగా వివరించి అవిఎలా తప్పో వివరించడం జరగలేదు. చారిత్రిక దృక్పథం లేనందువల్ల కూడ సంస్కరణవాదం దానికదే లక్ష్యమూ, మార్గమూ అవుతుంది. సంస్కరణవాదం కూడ, ఒకానొక కాలంలో మరొక లక్ష్యానికి మార్గం కావటం సరైనపద్ధతి

తర్వాత రంగనాయకమ్మ ప్రస్తావించిన అంశం కమ్యూనిస్టులు కోదలచుకున్న వారు ఇంట్లో ప్రవర్తించవలసిన తీరు. ఇది ఒక ఆచరణపూర్వకమైన ఇబ్బందిని విస్మరించడం మినహా మిగతాదంతా సవ్యంగానే నడిచింది. ఆ లోపంకూడ నవలలో అసలు సమాజమూ, జీవితమూ లేకపోవడంవల్ల ఏర్పడింది. ఆ ఆచరణపూర్వకమైన ఇబ్బందేమిటంటే కమ్యూనిస్టులకు ఇతరులకన్న ఎక్కువగా సాంఘిక జీవితం ఉంటుంది. కొందరికి వ్యక్తిగత, సాంఘిక జీవితాలమధ్య వేరుచేసిచూడలేని పరిస్థితి ఉంటుంది. ఎక్కువమంది వ్యక్తిగత జీవితాలను సామాజికజీవిత బాధ్యత తనలో లీనంచేసుకుంటుంది. మొత్తంమీద కమ్యూనిస్టుల వ్యక్తిగత జీవితంమీద సంఘానికి చాలపట్టు ఉంటుంది, ఈ అంశం రంగనాయకమ్మ గుర్తించలేదు. ఈ లోపం మినహాయిస్తే, కమ్యూనిస్టులు ఇళ్ళలో ప్రవర్తనలో ఏ దృక్పథం తీసుకోవాలో రంగనాయకమ్మ సరిగానే చెప్పారు. కాకపోతే రంగనాయకమ్మ ప్రతిపాదించిన జీవితవిధానానికి మనం సజీవజీవితం కల్పుకోవాలి.

"రాజకీయవిషయాల్లో కొంత విప్లవకరంగా ఉండేవాళ్ళల్లో కూడా సాంఘిక విషయాలకొచ్చేసరికి, అందులోనూ ఆడవాళ్ళ విషయాలకొచ్చేసరికి ఏ విప్లవాలూ ఉండవు...." (3. 18)

"....తల్లిదాకా ఎందుకు, భార్యలకీ పిల్లలకీకూడ ఒక్కముక్కనేర్పరు.... 'విప్లవకారుడి'గా పనిచెయ్యడం వుద్యోగం అయినట్టూ, ఆ వుద్యోగంచేసేసి ఆఫీసు నుంచి ఇంటికివొచ్చినట్టూ, ఆ రాతలూ, ఆ పత్రికలూ, ఆ వుపన్యాసాలూ, ఆ విప్లవాలూ అన్నీ రోడ్లమీదవాళ్ళకి వొదిలేసి ఇళ్ళకివస్తారు.... అందరిళ్ళల్లోనూ

వున్నట్టే ఈయనయాజమానీ, ఆవిడపనిమనిషీ...." (3.24) అనిమూర్తి అన్న మాటలు కమ్యూనిస్టులు కాదలుచుకున్నవాళ్ళు ఇళ్ళలో ఎలా ప్రవర్తించగూడదో తెల్పుతాయి.

ఇక సంఘభీతి విషయానికొస్తే రంగనాయకమ్మ సంఘభీతి అంటే ఏమిటి, ఎందుకుంది 'ఎందుకుండాలి' సంఘానికి వ్యక్తికీ ఐక్యత ఏమిటి, ఘర్షణఏమిటి, సంఘ నియమాల్ని వ్యక్తి పాటించాలా అక్కర్లేదా వంటి మౌలిక ప్రశ్న లేవీ వేసు కోకుం డానే కొన్ని పిడివాద ప్రతి పాదనలు చేశారు.

" 'నలుగురూ ఏదో అనుకోవడం' అంటూ జరుగుతూవున్నప్పుడు దానికి ఒక విలువ వుండడం అనేది కూడా జరుగుతూఉంటుంది. అస్తమానూ సమాజం, సమాజం అనకు అంటావు. సమాజంతో సంబంధం లేకుండా వ్యక్తి ఎక్కడో శూన్యంలో ఒంటరిగా లేడు. సమాజాన్ని అర్దం చేసుకోకపోతే వ్యక్తిని అర్థం చేసుకోలేము...." (1.36) అని మూర్తితో అనిపించిన సరైన అంశాన్ని రంగనాయకమ్మ ఆ తర్వాత తానే విస్మరించారు. ఈ అంశానికి సంబంధించి రంగనాయకమ్మ ముఖ్యంగా గుర్తైన లోపం ఒకటుంది, కమ్యూనిస్టులకు స్వేచ్ఛపట్ల, క్రమశిక్షణపట్ల ఉండే దృక్పథాన్ని ఆమెఅర్థం చేసుకోలేకపోయారు.

కమ్యూనిస్టులంత స్వేచ్ఛాప్రియులుమరెవరూ ఉండరు. కాని ప్రజలందరికీ స్వేచ్ఛను సంపాదించిపెట్టే మహత్తర కర్తవ్యంకోసం వాళ్ళుతమమీద ఉక్కు క్రమశిక్షణను అమలు చేసుకుంటారు. కమ్యూనిస్టులు అనుభవించగలిగిన స్వేచ్ఛంతా చారిత్రిక క్రమం అనే బాధ్యతకూ, సామాజిక విప్లవ కర్తవ్యంఅనే బాధ్యతకూలోబడి ఉండక తప్పని స్వేచ్ఛ. కమ్యూనిస్టుల స్వేచ్ఛ పరిమితిలేనిదికాదు, దాని పరిమితి బాధ్యత. ఈ పరిమితిని గుర్తించకుండా స్వేచ్ఛను పూర్తిగా అనుభవించదలచు కుంటే అది సమాజాన్ని పరిగణించని అరాచకవాదమవుతుంది గాని, సమాజాన్ని మార్చదలచుకున్న కమ్యూనిజం కాదు. వర్గరహిత సమాజ మార్గంలో భాగంగా శ్రామిక వర్గ నియంతృత్వాన్ని అమలు చేసినట్టే, కమ్యూనిస్టులు సమాజం మొత్తానికి ఉన్నతమైన స్వేచ్ఛను అందించడానికి కఠిన క్రమశిక్షణను అమలుచేసుకుంటారు. వర్గశత్రువుకు రహస్యమైన నిర్మాణ పద్ధతులనవలంబిస్తారు, ఈ విధానాలకు సంఘభీతి అని పేరు పెట్టినా, మరేపేరు పెట్టినా ఇది ఒక అనివార్య దశలో అనుసరించవలసిన విధానాలు.

(ఇంకావుంది)

# సన్యాసి రాముడు- పోలీసు "కాముడు" ఏలే రాజ్యంలో మోసగింపబడిన "పార్వతమ్మ-భగవతి"లకు రక్షణలేదా !

ప్రజలారా, విద్యార్థి, విద్యార్థినీ, ప్రజాస్వామిక మేధావులారా !!

"ఆడదై పుట్టడంకన్న అడవిలో మానై పుట్టడంమేలు" అనే ఒక అనాదిసామెత నేటికీ అక్షరాలా నిజమే అవుతున్నది. నాటినుండి నేటివరకు ఎన్నోమారాయి—కాని మారనిది ఒకటుంది అదేమిటంటే బలహీనులపై-బలవంతుల దౌర్జన్యాలు, దోపిడీలు, చిన్నకులాన్ని-పెద్దకులాలు, చిన్నజాతిని-పెద్దజాతి, చిన్నమతాన్ని-పెద్దమతం, పేదరికంపై-పెత్తందారితనం చట్టపరంగా దౌర్జన్యాలు చేస్తున్నది. అదేవిధంగా ఆర్థికంగా అనేక తరాలుగా పురుషుడిపై ఆధారపడి బ్రతుకుతున్న స్త్రీజాతిపై-స్త్రీనిజానిసగా చేసుకొని అహంకారంతో విర్రవీగుతున్న పురుషజాతి వెధవ పెత్తనంచేస్తున్నది. స్త్రీజాతి ప్రతిరోజు ఏదో ఒకచోట, ఏదో ఒకరీతిగా పురుషుడి వికృతించిన పెత్తనాన్ని రుచి చూస్తున్నది. మరికొందరు స్త్రీలు పురుషుడి కామప్రకోపాలను తీర్చుకొనుటకు ఉపయోగపడే అందమైన మెత్తటి రబ్బరు యంత్రాలుగా మిగిలిపోతున్నారు. దురదృష్టవశాత్తు మరికొందరు స్త్రీలైతే పురుషుడియొక్క నమ్మకమైనమాటలకు మోసపోయి అనుభవించిన ఆరక్షణం సృష్టికార్యానికి తల్లిగామారిపోయి, నమ్మించిన పురుషుడిచే నెట్టివేయబడి, పుట్టిన సంతానానికి తండ్రి పేరు చెప్పలేని దీనురాలిగా, సమాజంచే వెలివేయబడి, తలిదండ్రులకు దూరమై బ్రతుకుభారమై గంతలుకట్టుకున్న భారతదేశపు న్యాయస్థానంముందు న్యాయంకోసం బిక్షగత్తెగా నిలుచున్నది. సరిగ్గాఇటువంటి సంఘటన కొద్ది నెలలక్రితం మహబూబ్‌నగర్ పట్టణంలో జరిగింది. అక్కడి రూరల్ పోలీస్ స్టేషన్ (రక్షకభట నిలయం)లో పనిచేస్తున్న షాజాద్ P. C. No. 1153 అనే రక్షకభటుడు (పోలీసు కానిస్టేబుల్) "భగవతి" అనే 18 ఏళ్ళలోపు వయస్సున్న అమ్మాయిని వలలో వేసుకుని, సంవత్సర కాలం పట్టణంలోని బాయమ్మతోట వీధిలోని 13-114-22బి లో ఉంచి ఆమెను ఒక మగశిశువుకు తల్లినిచేసి నేను తండ్రినికాదని తరిమాడు. ఈ నేరస్తునిపై A S P విచారణ జరిపి శిక్షించాలని రిపోర్టు పంపినా అధికారుల లంచగొండితనంవల్ల అతడు ఇంకా ఉద్యోగంలో ఊరేగుతున్నాడు. ఈ సంఘటన పూర్తి వివరాలు ఈక్రింది విధంగా ఉన్నాయి.

20 సం॥రల క్రితం బ్రతకడానికి తమిళనాడునుండి మహబూబునగర్ వచ్చి కాటన్ మిల్ వర్కర్‌గా స్థిరపడి, ఈ మధ్య చిన్న "టీ" కొట్టుపై బ్రతికే పేదవాడైన "సుబ్రహ్మణ్యం" కూతురు భగవతి తండ్రి పేదతనానికి తనపెళ్ళి భారం కాకూడదనుకున్నది. భగవతి తమ ఇంటిపక్క మతాంతర వివాహం చేసుకుని సుఖంగా కాపుర

ముంటున్న చాంద్‌పాషా, సరస్వతి అనే ఆదర్శ దంపతులను చూసింది చాంద్‌పాషాకు మిత్రుడైన పోలీస్ షాజాద్ తరచు వీరిఇంటికి వచ్చిపోతూ భగవతితో పరిచయమై పెళ్ళిదాకా సంబంధాలు పెంచుకున్నాడు. ఈమె నమ్మింది. అమ్మాయి కుటుంబానికీ విషయం తెలియదు. ఆమెతమ్ముడు (మైనర్) స్టాలిన్‌కు మాత్రం కొంత తెలుసు. "ఈ సంబంధం ఫలితంగా భగవతి తల్లికావడానికి సిద్ధంగాఉంది. పరిస్థితిగమనించిన షాజాద్ చాంద్‌పాషా దంపతుల సహాయంతో 27-11-82న ఈమెను విజయవాడలో ఉంచాడు. అప్పుడు కాని స్టాలిన్‌ద్వారా అమ్మాయి ప్రేమ వ్యవహారం తండ్రి సుబ్రహ్మణ్యానికి తెలిసింది. అప్పుడు చాంద్‌పాషాద్వారా షాజాద్‌నుకలిసి పెళ్ళికి ఒప్పుకొని, తనస్వంత అల్లుడు, షాజాద్, చాంద్‌లను తీసుకొని కర్నూల్‌కు వెళ్ళి, కూతురునక్కడికి రప్పించి, "రిజిష్టరు వివాహం" చేద్దామనే ఉద్దేశ్యంతో ఆఫీస్‌కు వెళ్ళారు. ఆమె వయస్సు ఇంకా 18 సం॥లు దాటలేదని తెలిసి, ఈ పెళ్ళి రూల్స్‌కు విరుద్ధమవుతుందని ఆఫీసువారు చెప్పగా సాంప్రదాయక వివాహం చేయవచ్చులెమ్మని తిరిగివచ్చారు. ఆమెను బాయమ్మతోట వీధిలోని 13-114-22బి నెంబరుగల రూంలో ఉంచడు. ఇక్కడికి దగ్గరగా షాజాద్ చిన్నమత ఫాతిమా-ఉన్నిసా-బేగమ్ ఉంటుంది. ఈలోగా ఈ విషయమంతా తెలుసుకున్న షాజాద్ తండ్రి రిజర్వ్ పోలీస్ అయిన హసన్‌మిర్జా భగవతిని బేగం ఇంటికి పిలిపించి, బెదరించి. తనకొడుకుతో సంబంధాలు తెంచుకొమ్మని, "అబార్షన్" చేయించుకొని ఇంటిదారిపట్టమని బలవంతపెట్టాడు. దాన్ని తన జీవితసమస్యగా తీసుకున్న భగవతి అతనిబెదిరింపులకు లొంగక, షాజాద్‌ను పెళ్ళికై తొందరపెట్టింది, షాజాద్ రాకపోకలు తక్కువయ్యాయి. భగవతిని డాక్టరు రాజపురోహిత్ ఆసుపత్రి శ్రీనికేతన్ (స్టేషన్‌రోడ్)లో 23-3-1983న చేర్పించాడు షాజాద్ తనేతండ్రిగా చెప్పుకున్నాడు. ఆమె మగశిశువును ప్రసవించింది. షాజాద్, భగవతులకు మగశిశువు కలిగినట్టు డాక్టరుగారు ధృవీకరణపత్రంకూడా ఇచ్చాడు. తండ్రిగా అయితే చెప్పుకున్నాడు కాని బరువుబాధ్యతలు మోయడానికి సిద్ధంగాలేని షాజాద్ ఈమెను పుట్టినింటికి పొమ్మన్నాడు. ఆమె తండ్రి పెళ్ళి షురుపెట్టాడు. కాని ఈలోపే షాజాద్ తండ్రి ఈపిరికిపంద కొడుకుకు వేరే అమ్మాయితో పెళ్ళి నిశ్చయం చేశాడు. ఈరెండవ పెళ్ళికూతురుకు బాధ్యుడైనమామ మహబూబ్‌నగర్‌లో టౌన్ పోలీసు నెంబరు 793. అతడు షాజాద్ చెడు చరిత్ర తెలుసుకొని, భగవతిని కలిసి ధృవపర్చుకొని, ఈమెకు అన్యాయం చేయనని హామీయిస్తే భగవతి అతనికి చేతులెత్తి మొక్కింది. దీనురాలిగా, భర్త లేని తల్లిగా భయమెక్కువైన భగవతి 18-4-83న తనకుజరిగిన అన్యాయాన్నివివరిస్తూ, పచ్చిబాలింతఐనప్పటికీ స్వయంగా తనే S P గారిని కలిసి దరఖాస్తుయిచ్చింది. ఆ లోపే (పిరికిపంద) షాజాదుకు రెండవ అమ్మాయితో పెళ్ళి జరిగిపోయింది-ఒకస్త్రీ ఇంటిలో పన్నీరు-ఒకస్త్రీ ఇంటిలో కన్నీరు ఇది పురుషుడి అహంకారం ద్వారా జరిగిన వాస్తవమైన నాటకం కాకుంటే మరే మవుతుంది. పాలకులైన "అమ్మ" "అన్న"ల ఆదరిసులు ఏవి?

గుండె రాయి చేసుకొని రెండవ దఫా యస్.పి, కలెక్టర్, రూరల్ యస్.ఐ. తెలుగుదేశం అధ్యక్షుడు డా॥ విజయమోహన్‌రెడ్డి, అక్కా-చెల్లెళ్ళను అదుకునే పార్టీ ఎం.ఎల్.ఏ. జిల్లాకు చెందిన మంత్రి మహేంద్రనాథ్ గార్లకు కూడా అర్జీలు పెట్టుకున్నది. కాని ఎవ్వరూ పలకలేదు. చివరికి 2 నెలల తర్వాత 1-7-83న అడిషనల్ సూపరింటెంటు ఆఫ్ పోలీసు గారు షాజాదు మిత్రుడు చాందుపాషా, భగవతి కుటుంబ సభ్యులు మిగతావారిద్వారా ఎంక్వఇరీచేసి షాజాదును నేరస్తునిగా ధృవీకరించాడు అంతేగాక నాగర్ కర్నూల్ డియస్‌పి గారికి లెటర్‌నంబర్. 26-ఎ6-83ద్వారా ఈ కేసును పృగించి మళ్ళీ ఒకసారి ఎంక్వఇరిచేసి తగినచర్య తీసుకునవలసిందనీ పేర్కొన్నాడు ఒక కాపీ భగవతికి అందించారు. కాని 4 నెలల వరకు ఎవరూనోరు. మెదపలెదు. ఓర్పుకోల్పోకుండా 21/7/83; 8/8/83; 20/8/83; తేదీల్లో యస్.పి. కలెక్టర్‌లకు మళ్ళీ విషయాన్ని గుర్తుచేస్తేగాని 15/11/83న నాగర్‌కర్నూల్ డి యస్ పి. షాజాదు భగవతులనిద్దరినీ రూరల్ స్టేషన్‌కుపిలిపించి ఎంక్వయిరీ చేశారు తప్ప ఏలాంటి న్యాయనిర్ణయమూ జరగలేదు. కేసు ఎంక్వయిరి సమయంలో షాజాదు, అతని తండ్రి ఇద్దరుకలసి ఆఅమ్మాయి కిరాయిఉన్న ఇంటియజమానిని భయపెట్టారు. కిరాయి ఇవ్వమన్నారు. యింతవరకు యివ్వలేదు. మిత్రుడు చాందుపాషాను కూడా అబద్ధమాడమని బలవంతపెట్టాడు. మంచి మనసు గల అతడు ఋది వరకే తనద్వారా భగవతికి జరిగిన అన్యాయానికి బాధపడుతు మరోసారి ఆమెకు అన్యాయం చేయలేనని నొక్కి చెప్పాడు. ఎలాగైతేనేం మంచిమనసు గల చాందు, ఇంటి యజమానులిద్దరూ వాస్తవంచెప్పి ఈమెకు అండగా నిలిచారు అయితే ఈకేసు పరిశీలించిన అధికారులు తాము తీసుకున్న నిర్ణయాన్ని భగవతికి చేకూర్చాలనుకున్న న్యాయసహాయాన్ని బయటపెట్టకుండా ఎందుకు ఆపుతున్నారు. అలస్యం అనేక అనుమానాలకు దారి తీస్తుంది. బలవంతంగా బయటకు కక్కిస్తుంది. కాబట్టి చెప్తున్నాం-4 నెలల కాలంగా షాజాద్‌ద్వారా ఈమెకీ అందవలసిన దాంపత్య ఆర్థిక, సామాజిక సహాయాన్ని ఎందుకు అందజేయలేక పోతున్నారు. పేదవని, ఎవ్వరూ పట్టించుకునే వారులేరనేనా? అదే పోలీసు ఆఫీసరి కూతురుకో, బంధువులకో, రాజకీయనాయకుల అప్తులకో ఈ అన్యాయంజరిగితే ఆఫీసర్లు ఇదేమౌనం వహించేవారా? అసలు కారణం షాజాదుకు-పోలీసు ఆఫీసరుకు లోలోన ఏమైనా ఉద్యోగ, అక్రమ ఆర్థిక సంబంధాలు (లంచాలు) ఉండవచ్చేమో? ప్రజలారా, మేధావులారా!!

ఈరోజు ఈ సమస్య అభాగ్యపు భగవతికి జరిగింది మాత్రమేకాదు- పోలీసులచేత ఎంతో మంది స్త్రీలు యిలాగే మోసగింపబడి జీవితాలను ఎడారుల్లో ఎండేసుకుంటున్నారు ఢిల్లీకి 70 కి మీ. దూరంలో (మాయాత్యాగి) అనే స్త్రీని పోలీసులు పట్టపగలు, నట్టనడిబజార్లో నగ్నంగా ఊరేగిస్తే మనమంతా ఏంచేశాం? ఎక్కడో ఢిల్లీలోకదా అనుకున్నాం. "రమీజాబీ"ని పోలీసులు రేప్ చేస్తే అప్పుడేమన్నాం?

ఆఁ.... హైదాబ్రాదులోకదా! మనకెందుకులే అనుకున్నాం-అంతేగాక కోర్టులో పరిశీలనలో ఉందికదా! తీర్పురానిద్దాం అని ఓర్పుపట్టాం. మొన్ననే వారం క్రితం బెంగుళూరు హైకోర్టు ఇచ్చిన తీర్పులో "రమీజాబి కేసులో నిందితులందరూ నిర్దోషులేనని" న్యాయశాస్త్రం పచ్చి అసహ్యకర అబద్ధాన్ని కక్కింది—ఇదీ మన న్యాయవ్యవస్థ. భువనగిరిలో "షకీలాబీ"ని చెరిస్తే, ఎక్కడి భువనగిరి, ఎక్కడ మహబూబ్‌నగర్ అని ముక్కూచెవులూ మూసుకున్నాం—మొన్ననే తెలుగుదేశం రాజ్యంలో వికారాబాద్‌లో "పార్వతమ్మ"ను చెరిస్తే, ఏం చేద్దాం? ఎవర్నని మనం ఆపగలమని చెవిటివారిలా, మూగవారిలా మసలుతున్నాం. గత ఫిబ్రవరిలో మహబూబ్‌నగర్ టౌన్‌లో ఒకపల్లె యువతిని ఇద్దరు పోలీసు కుక్కలు క్రూరంగా అనుభవిస్తే మనమంతా ఏమనుకున్నాం గుండెమీద చేయివేసుకుని మనుషుల్లా ఆలోచించి సమాధానం చెప్పండి. ఆమె చెడి తిరుగుతున్న ఆడదట!....అని ఒకరంటే, పోలీసుల రాజ్యం ఎవరు అడ్డుకుంటారు? అని మరికొందరు నిట్టూర్పు విడిస్తే, మరికొందరు చపటదద్దమ్మలు మాఇంటి దాకా వచ్చే ధైర్య మెవడికి ఉందిలే? ఆ పల్లెపిల్ల మా చెల్లెలా? నాకూతురా? అని అందరూ ముక్కు చెవులు నోరు మూసుకున్నారు. ఇదీ మన సంస్కృతి చెడు ఆనకూ, వినకూ, చూడకూ అంటే అర్థమిదేనేమో? మోసం చేసిన షాజాదు ముస్లిం, మోసపోయిన భగవతి హిందూ అని దీన్ని మత సమస్యగా మార్చే ప్రమాదముంది జాగ్రత్త-అట్టి వారికి ఒకేప్రశ్న షాజాదు మిత్రుడు చాంద్‌పాషా భగవతికి అనుకూలంగా సాక్ష్యమిచ్చాడా? షాజాదు వైపు పలికాడా? భగవతి వైపే పలికాడుకదా!

ప్రజలారా! అర్ధరాత్రి ఒంటరిగా స్త్రీ ఇంటికి తిరిగి రాగలిగినరోజే నా దేశానికి నిజమైన స్వాతంత్ర్యం వచ్చినట్లని గాంధీ మాటను గుర్తుచేసుకుని మనమంతా పోలీసుల ఆలశ్యాన్ని ఖండించి, వెంటనే తీర్పు చేప్పి భగవతికి ఆర్థిక, సామాజిక భద్రత కల్పించవలసిందిగా—కలెక్టర్‌కు (ఆఫీస్‌వద్ద) మెమోరాండం ఇవ్వడం, పై అధికార్లకు నిరసన తెలపడం నిరసన తెలుపుచున్నట్లు సంతకాలు చేయటం వంటి అన్ని కార్యక్రమాలలో అన్ని పార్టీలకు చెందిన ప్రజాస్వామ్య వాదులు పాల్గొని జయప్రదం చేయగోరుతున్నాము.

డిమాండ్స్
1 ఎంక్వయిరీ రిపోర్టు బయటపెట్టి షాజాదును సస్పెండ్ చేయాలి.
2 షాజాదు సంపాదనలో ఈమెకు అర్థ భాగం ఇప్పించాలి.
3 ఎ.యస్.పి.గారు షాజాదును దోషిగా ధృవీకరించిన నాటి నుండి అతడిని సస్పెండు చేసినట్లు ప్రకటించాలి.
4 మహబూబ్‌నగర్‌లో మానభంగానికి పాల్పడిన ఇద్దరు కానిస్టేబుల్స్ కృష్ణ, రమేష్‌లను విచారణ పూర్తయ్యేవరకు సస్పెన్షన్‌లో ఉంచాలి.

ఇట్లు విప్లవాభివందనములతో

రాడికల్ విద్యార్థి సంఘం, మహబూబ్‌నగర్.

(4వ కవరు తరువాయి)

| | | |
|---|---|---|
| 19. | లాల్ బనో గులామీ ఛోడో - బోలో వందేమాతరం - ఎన్.కె. | 1-00 |
| 20. | కోరస్ - దామెర రాములు | 2-50 |
| 21. | ఎర్రగాలి - జైరామ్ | 5.00 |
| 22. | మళ్ళీ సూర్యోదయం - సూర్యప్రకాశ్ | 3.00 |
| 23. | లయ - పొయెట్రీ ఫోరం - వేములవాడ | 3 00 |

పాటలు :

| | | |
|---|---|---|
| 24. | తెలంగాణ పోరాట పాటలు | 4.00 |
| 25. | సుద్దాల హనుమంతు పాటలు | 4.00 |
| 26. | అల్లం వీరయ్య పాటలు | 1-50 |
| 27. | జననాట్యమండలి పాటలు | 3.00 |
| 28 | మహాకవికి కవితాంజలి - సాహితీ మిత్రులు, విజయనగరం | 2.00 |

వ్యాసాలు :

| | | |
|---|---|---|
| 29. | కళలు - సాహిత్యం ఎవరికోసం ? | 1.00 |
| 30. | కళలూ, సారస్వతం ఎవరికోసం ? - మావో | 1.00 |
| 31. | ప్రజలపాటలు - అనుభవాలు - గద్దర్, రామారావు, వంగపండు | 1-25 |
| 32. | తెలుగులో కవితా విప్లవాలస్వరూపం - 'కవిసేన'కు జవాబు - త్రిపురనేని మధుసూదనరావు | 1.00 |
| 33. | సాహిత్యం కుట్రకాదు, రచయితలు కుట్రదారులుకారు " | 1-00 |
| 34. | గతితార్కిక భౌతిక మానవతావాదం " | 2-00 |
| 35. | ప్రజాసాహిత్యం, కళలు ఎలావుండాలి ? -వర్గీస్ | 2.00 |
| 36. | లూసున్ సాహిత్యం జీవితం అను ; కొ. కు. | 1.50 |
| 37. | శ్రీశ్రీ చిరునామా - విరసం | 2.00 |
| 38. | తెలంగాణ విమోచనోద్యమం - తెలుగు నవల -వరవరరావు | మేలు 50.00<br>సాదా 35.00 |
| 39. | Raging storm (Poetry anthology) - VIRASAM | 15-00 |
| 40 | Sword song ,, Cherabandaraju | 10-00 |
| 41. | All India League of Revolutionary Culture - Souvenir - 1983 | 15-00 |
| 42. | Hail Revolution (Poetry anthology) AILRC | 15-00 |

పై పుస్తకాలు కావల్సినవారు వాటిధరలతోపాటు పోస్టేజీ కలిపి ఎం ఒ ద్వారా ఈక్రింది అడ్రసుకి పంపించండి. పుస్తకాలు బుక్‌పోస్ట్‌ద్వారా పంపిస్తాం.

SRJANA Telugu Monthly Hanumakonda-506 001.

SRJANA Telugu Monthly June/July '84 - H/HNK-3
Regd. No. with Registrar of Newspapers 10953/67

# మీ ఊళ్ళో గ్రంథాలయంలోగానీ, మీ స్వంత గ్రంథాలయంలోగానీ ఈ పుస్తకాలున్నాయా ? లేకుంటే వెంటనే తెప్పించుకోండి.

చదవండి — విరివిగా చదివించండి

**నవలలు :**

1. బతుకుపోరు - బి. ఎస్. రాములు 5.00
2. కొమురంభీము - సాహు, అల్లం రాజయ్య 8-00
3. అగ్నికణం - అల్లం రాజయ్య 6.00
4. నాకుటుంబం - టావ్ చెంగ్ 4-00

**కథలు :**

5. సృష్టికర్తలు - అల్లం రాజయ్య 5.00
6. భూమి - అల్లం రాజయ్య 7.00
7. బొగ్గుపొరల్లో - సింగరేణి కార్మిక కథలు 5-00
8. అనామకుడిడైరీ - కె. రాంమోహన్ రాజు 5.00

**నాటికలు, నాటకాలు :**

9. గ్రామాలు మేల్కొంటున్నాయి-చెరబండరాజు 8.00
10. గంజినీళ్ళు - చెరబండరాజు 1.50

**కవితా సంకలనాలు :**

11. ఉద్యమం నెలబాలుడు - శివసాగర్. మేలుప్రతి 10.00, సాదాప్రతి 5 00
12. పోరాటాల శ్రీరాములు - విరసం 0.75
13. తుడుం - ఇంద్రవెల్లిపై విరసం కవితా సంకలనం 1-25
14. సముద్రం - వరవరరావు 2.00
15 రోడ్డుమీదసూర్యుడు - కె. రాంమోహన్ రాజు 3.00
16. చర్య - సాగర్ 2.00
17. కొలిమి - సాగర్ 2.00
18. పాటవెన్నెలమీద నడుస్తుంది - అజ్ఞాతసూరీడు 3.00

( మిగతా మూడవ కవర్‌లో )